కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-52 ఆగస్టు2012

**మూలం: http://kottapalli.in/2012/08/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'స్వాతంత్ర్య దినం':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల: రూ.20/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in




# విషయ సూచిక

# స్వాతంత్ర్యం వచ్చింది!

"1947 ఆగస్టు 15 న మనకు స్వాతంత్ర్యం వచ్చింది.. మనకు స్వాతంత్ర్యం వచ్చింది.." బట్టీ పడుతున్నాడు సూర్యం.

వాళ్ళ బడిలో ఆగస్టు పదిహేనున స్పీచ్ ఇవ్వాలని వీడికి ఉబలాటం. వాళ్ళమ్మని అడిగితే ఏవో కొన్ని వాక్యాలు రాసిచ్చినట్లుంది; వీడు బట్టీ కొడుతున్నాడు.

"..గాంధీజీ నాయకత్వంలో అందరూ ఒక్కటై బ్రిటిష్ పాలకులను తరిమి కొట్టారు.." చదువుతున్నాడు వాడు.

పడక్కుర్చీలో కూర్చున్న తాతయ్య ఆగలేక అరిచాడు- "ఒరొరోయ్! ఆగి, ఓ మాట చెప్పు; మన వాళ్లంతా అమెరికా పోయి ఉద్యోగాలు చేసేస్తున్నారా? మీ బాబాయేమో ఆస్ట్రేలియాలో చదువులు వెలగబెడుతున్నాడా? మరి అందరూ పోయి లండన్లో డాక్టర్లయిపోతున్నారా? ఇంకా ఏంటిరా, ఈ 'తరిమి కొట్టటాలూ', స్వాతంత్ర్య 'దినాలూ'?"

"అంటే, అట్లా కాదు; బ్రిటిష్ వాళ్ళు మన దేశాన్ని ఆక్రమించారన్నమాట- ఇప్పుడు మనం ఎవర్నీ ఆక్రమించలేదుగా?" అన్నాడు సత్యం, వెనక్కి తగ్గకుండా.

తాతయ్య అడిగాడు సరైన సందర్భమే దొరికిందని సంతోషపడుతూ- " 'ఆక్రమించటం' అంటే ఏంచేశారో పాపం!" అని.

"అంటే, మంత్రులు, ప్రధానమంత్రులు- ఇట్లా ఎవరూ ఉండరు. వాళ్ళే రాజుల్లాగానన్నమాట. మంచి పదవుల్లో అందరూ బ్రిటిష్ వాళ్ళనే పెట్టుకునేవాళ్ళు. మన దేశపు ప్రజల్ని 'కూలీలు' అని పిలిచేవాళ్ళు; చిన్నచూపు చూసేవాళ్ళు. ప్రతి వస్తువు మీదా పన్నులు వేసి, వచ్చిన డబ్బునంతా

తమ దేశానికి పంపించేసుకునేవాళ్ళు. అది తప్పు కదా?!" అడిగాడు సూర్యం.

వాడికి అంత తెలుసని అనుకోలేదు తాతయ్య. ఒక్క క్షణం నివ్వెరపోయి, అన్నాడు- "అవునురా, నిజమే. కానీ మన దేశం వాళ్ళు ఊరికే ఉండలేదురా, చాలా తీవ్రంగా వ్యతిరేకించారు ఈ పంథాని. గాంధీగారి వెంట నడిచినవాళ్ళు ధర్నాలు, బందులు చేసి, పత్రికలు నడిపారు. ఇంకా కొందరు తుపాకులు చేతబూని తిరుగుబాట్లు చేశారు- బ్రిటిష్ అధికారులను కాల్చి చంపేశారు. ఇక దేశంలో మామూలు జనాలు కూడా బ్రిటిష్ వాళ్ళు తయారు చేసిన సామానులను కొనటం మానేశారు. ఇక వ్యాపారం జరిగేదెట్లాగ? చివరికి 'ఇక్కడ రాజ్యం చేసీ లాభం లేదులే' అని బ్రిటిష్ వాళ్ళు మన దేశాన్ని మనకు వదిలేసి వెళ్ళిపోయారు" చెప్పాడు.

"అంటే మనవాళ్ళు వాళ్ళని తరిమి కొట్టినట్లే కదా!" అన్నాడు సత్యం, తెలివిగా.

"కాని, ఒరే, ఈ విదేశీవాళ్ళు చాలా తెలివైనవాళ్ళురా! వీళ్ళు ఇక్కడ ఉన్నప్పుడు మనలో కొందరికి వాళ్ళ అలవాట్లు నేర్పించారు; మనవాళ్ళూ వాళ్లను అనుకరించారు. అయితే ఇక రానురాను మనవాళ్ళు ఎంతమంది ఆ పద్ధతులకు బానిసలు అయ్యారంటే, ఇక వీళ్ళు పదవుల్లో ఉంటే బ్రిటిష్ వాళ్ళు పదవుల్లో ఉన్నట్లే! తేడా అల్లా ఏమంటే, బ్రిటిష్ వాళ్ళు మన సంపదని ఇంగ్లండుకు తరలించుకుపోతే, వీళ్ళు దాన్ని కొల్లగొట్టి తమ సొంత ఖాతాల్లోకి తరలించుకు పోతున్నారు! నిజానికి మనం అందరం కూడా మనకు తెలీకుండానే విదేశీ అనుకరణలో పడిపోయాం- నీకు చాలా ఇష్టం కదూ, పిజ్జాలూ, బర్గర్లూ, ఐస్క్రీంలూ?"

అవునన్నట్లు తలూపాడు సూర్యం.

"అవన్నీ విదేశీ ఆహారాలేరా! ఒకప్పుడు విదేశీయులు మన ఆహార అలవాట్లని మెచ్చుకునేవాళ్ళు- ఇప్పుడు మనం వాళ్ల భజన చేస్తున్నాం. కూల్డ్రింకులు త్రాగటం విదేశీ అలవాటేగా? సిగరెట్లూ, రకరకాల సారాయిలూ- ఇవన్నీ మన సమాజానికి విదేశీయులు అంటించిన దురలవాట్లే.

ఇట్లాంటివి ఇంకా ఎన్ని ఉన్నాయో లెక్కలేదు. మన సంగీతం అంతా ఇప్పుడు విదేశీ దరువే అయిపోయింది; మన భాషల్ని విదేశీ భాషలు ఆక్రమించేశాయి- మన భావనల్ని చక్కగా వెలువరించాలంటే ఇంగ్లీష్ తప్ప వేరే భాషే దొరకటంలేదు మనకు! ఆంగ్లేయులు మన దేశాన్ని వదిలేసినా, మన సమాజం అంతా ఆంగ్లేయ మయమే అయిపోయింది, ఇకనేమి? మన ఊళ్ళూ, ఇళ్ళూ, పద్ధతులూ అన్నీ ఇప్పుడు విదేశీనే! వీటినన్నిటినీ దూరం చేసుకోవాలంటే ఇంకో స్వాతంత్ర్యసంగ్రామం నడిపించాలేమో, మరి!" ఉపన్యాసం దంచేశాడు తాతయ్య.

"నడిపిద్దాంలే, తాతయ్యా! మేమున్నాం కదా, నీకెందుకు బెంగ?!" అన్నాడు సూర్యం.

"అవునురా, అదే, నా ధైర్యం. మీరున్నారుగా!" అన్నాడు తాతయ్య కూడా, నవ్వేస్తూ.

అవును- మనం ఉన్నాంగా?!

మరో స్వాతంత్ర్యదినోత్సవ అభినందనలతో-

కొత్తపల్లి బృందం.

కవిత

**అండ**

బాల్యంలో అమ్మానాన్నల -
విద్యార్థి దశలో అధ్యాపకుల -
ఆపద సమయంలో ఆప్తుల -
విధి నిర్వహణలో అధికారుల-
సంసార జీవితంలో భాగస్వాముల-
ముసలి తనంలో అందరి-
"అండ" అవసరం!
ఎక్కడ అది కొరవడినా
అవుతుంది జీవితం గందరగోళం!

*- షేక్ రియాజుద్దీన్ అహ్మద్, అనంతపురం*




# నీతి చంద్రిక

*జరిగిన కథ: దేశాలు చూసి తిరిగి వచ్చిన కొంగ, తనకు ఎదురైన చేదు అనుభవాన్ని హంసరాజుకు వివరిస్తున్నది. నెమలి అనుచరులు తనను ఏ విధంగా హింసించారో వివరిస్తూ, అక్కడ ఎదురైన చిలుక తనకు చెప్పిన "పులి-కొంగ" కథని వినిపిస్తుంది. అది ఇంకా ఏం చెబుతున్నదో- ఇదిగో, చదవండి- నీతిచంద్రిక-33 వ భాగం...*

అటుపైన చిత్రవర్ణుడి అనుచరులు అందరూ అదే విధంగా నన్ను తిట్టారు. వాళ్లలో నన్ను ఎవరు ఎన్ని మాటలన్నారో చెప్పలేను. శత్రువును యముడి దగ్గరికి పంపేవరకూ చల్లారేవి కావు అవి- ఆ మాటలన్నీ ఎప్పటికీ నా మనసును పట్టి పీడిస్తూనే ఉంటాయి. అయినా నేను బలహీనుడిని: కనుకనే, నా తక్కువతనానికి లొంగి, అవమానాన్ని మ్రింగి, ఎప్పటిలాగానే అందరిలోనూ నా యీ తలని ఇట్లా ఊపుకుంటూ నడుస్తున్నాను. ఛీ, నాదీ ఒక పౌరుషమేనా?! అభిమానం ఉన్నవాడు ఎవడూ యీ అవమానాన్ని దిగమ్రింగి

ఊరుకోలేదు. చేతనత్వం లేని సూర్యకాంత-మణి కూడా సూర్యుడి కిరణాలు సోకగానే వెలుగులు చిమ్ముతుందే, మరి చేతనుడైన అభిమానవంతుడు ఇట్లా పగవారు తనకు చేసిన అవమానాన్ని ఎలా సహిస్తాడు? అయినా నా యీ అవమానపు గాథను తమరికి విన్నవించుకోవాలన్న కోరికే నా ప్రాణాలు శరీరాన్ని విడిచిపెట్టకుండాకట్టిన త్రాడు మాదిరి నన్ను ఇక్కడికి ఈడ్చి తెచ్చింది తప్ప, మరొకటి కాదు.



అయ్యో! 'విధి చేష్ట ఎలాంటిది' అంటే ఏం చెప్పను? నాకు ఇలా కొండంత బలగం ఉండీ ఎవ్వరూ లేని అనామకుడినై, నాది కాని దేశంలో, దిక్కుమాలిన పక్షినై నిలబడాల్సి వచ్చింది చూడండి! అదే విధి చేష్ట. మీవంటి గొప్ప ప్రభువుకు అనుచరుడినై ఉండి కూడా, శత్రువుల ముందు చేతగానివాడి మాదిరి నిలబడి, నిండు సభలో రోత పుట్టించే మాటలు అన్నన్ని వినవలసి వచ్చిందే, అదే, విధిచేష్ట!

గడచిపోయిన సంగతుల గురించి ఇప్పుడు విచారపడి ప్రయోజనం లేదు గానీ, మరవాలనుకున్నా మరపుకు రాక, ఆ భంగపాటు నా మనసులో శూలం లాగా నాటుకొని సలపరిస్తూ ఉన్నది. నాకు ఇన్ని అవమానాలెందుకు? 'పగవారి చేత చిక్కి కష్టపడు' అని విధి ఆ విధంగా రాసి పెట్టి ఉంటే ఎవ్వరు తప్పించుకోగల్గుతారు? ఈ సంగతినంతా దేవరవారి సమ్ముఖంలో తెలియజేసి, తమరి మనసుకు కష్టం కలిగిస్తున్నందుకు నా మనసు ఎంత క్షోభిస్తున్నదో చెప్పలేను.

అక్కడ చిత్రవర్ణుడు కొంచెం దయ తలచి, నన్ను చంపేందుకు మనసు రాక, 'పరాయి

దేశస్థుడులే' అని ఊరికే వదిలి పెట్టాడు. తమరి పాద పద్మాలను మళ్ళీ చూసే అదృష్టం బలంగా ఉంది కాబట్టి, యుద్ధం ఇలా ముంచుకు రానున్నదన్న వార్తను మోసుకొని ఇట్లా రాగలిగాను.



మార్గాయాసం వల్ల నా మనసు ఇంకా అదుపులోకి రాలేదు; అంతే కాకుండా దు:ఖంతోటీ, విషాదం తోటీ చితికిపోతున్న నా హృదయం ఇంతకంటే ఎక్కువగా ఏమీ విన్నవించుకోలేదు. నా ప్రభువుల వారికి వార్తావిశేషాలను అన్నిటినీ నివేదించాలన్న ఉత్సాహం, ప్రభువుల సన్నిధిలో కొంతసేపు నిలబడి సేద తీరాలన్న కోరిక ఆలంబనలుగా ఇంతసేపు నిలబడగల్గాను. నాకు తెలిసినంతవరకు ఏదీ దాచకుండా జరిగినదంతా తమరికి విన్నవించాలన్న నా కోరిక ఇప్పటికి నెరవేరింది. నెమలిరాజు నన్ను అక్కడినుండి పంపిస్తూ "నీ వెనుకనే చిలుకను పంపిస్తాను-నువ్వు ముందు పో!" అన్నాడు. అదికూడాత్వరలోనే చేరుకుంటుందేమో- ఏమి చేయాలన్నది ఇక దేవరవారికకే ఎరుక. నేను పోయి వస్తాను" అన్నది.

అప్పుడు హంసరాజు హిరణ్యగర్భుడు దాన్ని దయతో చూసి, "దీర్ఘముఖా! దైవ నిర్ణయం ప్రకారం ఎదురయ్యేవాటికి దు:ఖించాల్సిన పనిలేదు. అంతా తెలిసినవాడివి, నీకు నేను చెప్పాలా? నువ్వు చాలా ధైర్యశాలివి కదా, ఇంత బలహీనపు మాటలు ఎందుకు, పల్కుతున్నావు? ఆ నెమలిరాజెవరో తన మిత్రులతోటీ, బంధువులతోటీ, మంత్రి పరివారంతోటీ సమూలంగా నశించాలనే కాబోలు, నీవంటి సాధువుకు అపకారం తలపెట్టాడు. ఏమైతేనేమి, ఇంతటితో

మునిగిపోయినది ఏమీ లేదు. రేపే బయలుదేరి వెళ్దాం. పాముల్ని మేసే ఆ నెమలిరాజు గర్వాన్ని మనం స్వయంగా మట్టుబెట్టి వద్దాం. బాధపడకు-ఊరడిల్లు. ప్రజలందరి సత్కారానికీ అర్హుడివి నువ్వు- అట్లాంటి నీకా, ఇన్ని కష్టాలు రావల్సింది!?" అని చెవులకు ఇంపుగా మాట్లాడాడు. ఆ విధంగా తన దు:ఖం తగ్గేలా మాట్లాడిన ప్రభువు అనుమతి తీసుకొని, కొంత తేలికైన మనసుతో దీర్ఘముఖుడు తన ఇంటికి తాను పోయాడు.



ఇంక అక్కడ- దీర్ఘముఖుడిని వెళ్లగొట్టాక, నెమలిరాజు తన అనుచరుడైన చిలుకను దగ్గరకు పిలిచి కూర్చోబెట్టుకున్నది; హిరణ్యగర్భుడి కొలువులో పలుకవలసిన మాటలు అన్నింటినీబాగా తెలియపరచింది- "అరుణముఖా! నువ్వు వీటినన్నిటినీ అక్కడ నీళ్ళు నములుతూ చెప్పకు- ధైర్యంగా సభ మధ్యలో నిలబడు; గట్టిగా మాట్లాడు- సరేనా?" అని చెప్పి పంపించింది.

అటు చిలుకను పంపించగానే అది తన మంత్రిని ఒక్కడినే రమ్మని, అతనితో మంతనాలాడింది. మంత్రి సలహామేరకు 'మేఘవర్ణుడు' అనేకాకిని ఒకదాన్ని రహస్యంగా తన దగ్గరికి పిలిపించుకున్నది. దాన్ని కూర్చోబెట్టి, ప్రేమగా పలకరించి, ఇలా అన్నది- "చూడు, మనం ఇప్పుడు ఆ కర్పూర ద్వీపాన్ని ఆక్రమించే ప్రయత్నం మొదలు పెట్టాల్సి ఉన్నది. దానికి నీ సహకారం చాలా అవసరం. యీపనిని నెరవేర్చటానికి నీకంటే సమర్థుడు వేరే ఎవ్వరూ లేరు. నేను చెప్పే యీ పనిని నువ్వు చాలా రహస్యంగా నిర్వహించుకొని రావాల్సి ఉన్నది.

విను- నువ్వు మారువేషంలో రహస్యంగా పోయి, ఎట్లాగైనా ఉపాయంతో ఆ హిరణ్యగర్భుడి స్నేహాన్ని, నమ్మకాన్ని పొందాలి. నీ వేషభాషలతోను, ప్రవర్తనతోను అతనికి నీపట్ల ఇష్టం కలిగేటట్లు చేసుకోవాలి.



అన్ని విషయాలూ అతను నీతో చర్చించగలిగే-టట్లు చనువు ఏర్పరచాలి. అతని అనుకూలతలు, ప్రతికూలతలు- వాటి పద్ధతులు- అన్నీ తెలుసుకొని, ఎప్పటికప్పుడు ఎలా చేస్తే మనకోరిక నెరవేరుతుందో చూసుకుంటూ, అలాగ ప్రవర్తిస్తూ పోవాలి. మన పనికి మొత్తానికీ నువ్వే కీలకమైన వాడివని గుర్తించి మసలుకో- కార్య నిర్వాహకుడివి నువ్వే సుమా, గుర్తుంచుకో!

అక్కడ రాజ పరివారంలో ఉండేవాళ్ళు ఎవరైనా సరే- ఏనుగుగానీ, దోమగానీ- వాళ్లను దూరం చేసుకోకు- వాళ్లందరినీ దగ్గర చేసుకో. వాళ్ళ వాళ్ళ మనసు కనిపెట్టి తిరుగు. వాళ్ళకెవరికైనా నీపట్ల కొంచెం అయిష్టం కలిగినా సరే, సమయం వచ్చినప్పుడు నీమీద పట్టి అభాండాలు వేసి రభస చేస్తారు- ఆవగింజలంత తప్పుల్ని కూడా తాటికాయ-లంతగా హంసరాజు చెవుల్లో పోసి ఎగదోస్తారు; తప్పును నీపైన మోపి నిన్ను అతనికి దూరం చేస్తారు. దానివల్ల మనం తలపెట్టిన పనికి ఎక్కడలేని నష్టం వాటిల్లుతుంది. మన ప్రయత్నం అంతా వృథా అయిపోతుంది. పని చెడిపోయిన తర్వాత ఇక ఏమి అనుకొనీ ఏమి లాభం? అందువల్ల జాగ్రత్తగా ఉండు.

రాజుల మనసులు కూడా ఏ క్షణానికి ఆక్షణమే మారుతుంటాయి. అవి ఎప్పుడు ఎలా ఉంటాయో తెలుసుకొని మెలగటం చాలా కష్టం. అందుకని 'అయ్యా, దేవుడా'అని

అయిన దానికీ, కాని దానికీ వెంటపడి పైన పూసుకోకు- 'కత్తిమీద సాము చేస్తున్నాం' అని గుర్తుంచుకొని మెలకువతో ప్రయత్నించు."

రాజుగారి దయ ఉన్నన్ని రోజులూ అందరూ మిత్రులే- కాని, అది ఆయింత తగ్గిందంటే చాలు- మిత్రులన్నవాళ్ళే శత్రువులై కూర్చుంటారు. అడవుల్ని దహించే అగ్నికి చాలా దగ్గరి స్నేహితుడు వాయువు కదా!? కానీ అదే మంటకు బలం తగ్గిందనుకో; బలహీనమైనదై ఏదైనా ఓ దీపంలో నెలకొని ఉందనుకో- అప్పుడు ఆ గాలే దాన్ని ఆర్పివేసేందుకు ప్రయత్నిస్తుంది. అందుకని నువ్వు ఎవ్వరికీ చురుక్కుమనేట్లు ప్రవర్తించకు. రాజుగారి దృష్టి ఎలా ఉంటున్నదో గమనిస్తూ అతని మనసును అనుసరించు. ఈ పనిలో ఎక్కడా నీకు తెలీని సంగతులేవీ లేవు.

మరొక్కమాట- అక్కడ నీకు ఎవ్వరు ఎంత దగ్గరైనా సరే- వాళ్ళముందు నీ హృదయాన్ని విప్పి చూపకు; కలలోనైనా ఇక్కడి మాటలు అక్కడ చెప్పకు. నువ్వు తెలివైనవాడివి. ఇంకొకరిచేత ఇంతగా చెప్పించుకొనవలసిన అవసరం ఉన్నవాడివి కాదు. పోయిరా, మరి! మేం ఇకనుండి ఎప్పుడూ నీ సమాచారం కోసమే ఎదురుచూస్తుంటామని మరువకు!" అని చెప్పి పంపింది.



ఆలోగా, ఇక్కడ దీర్ఘముఖుడు అలా కనుమరుగు కాగానే, చక్రవాకం అనే పక్షి దాన్ని ఎగతాళి చేస్తున్నట్లు సన్నగా నవ్వి, హంసరాజుతో అన్నది- "చూశారా, ప్రభూ! మన ఊరి మూర్ఖుడు పరదేశం పోయి ఏం కొని తెచ్చాడో చూశారా? 'తా చెడ్డ కోతి వనమంతా చెరచింది' అంటే ఇదే గద! దుష్టుడు తాను చెడిపోవటమే కాదట; తన వాళ్ళందరికీ కీడు

తెచ్చిపెడతాడట! దానికి నిదర్శనం ఈ నీచపు కొంగే. ఎలాంటి కారణమూ లేకుండానే పోట్లాటలకు కాలు దువ్వటం అల్పుల లక్షణం.

ఉత్తముడైనవాడు పండ్లతో నిండిన చెట్టు లాగా వంగి ఉంటాడట; ఏమీ తెలీని మూర్ఖుడు మటుకు ఎండిన మొద్దు మాదిరి- తంతే విరుగుతాడట గానీ, వంగను మాత్రం వంగడట!

పండితులు కాకున్నా 'పండితులం' అనుకునేవాళ్ళు పదివేల మంత్రాలు చదివినా సరే- వాళ్లను పట్టి పీడించే దోషాలు మటుకు వాళ్ళను విడిచిపెట్టవు అని చెబుతారు. బొగ్గును నూరుసార్లు గంగా జలంతో కడిగితే మాత్రం దాని మలినత్వం పోదు కదా.." అని రకరకాలుగా నిందించటం మొదలుపెట్టింది.

అప్పుడు దాన్ని వారిస్తూ, హంసరాజు అన్నది- "ఇప్పుడు దాన్ని ఇట్లా నిందించి ప్రయోజనం ఏమున్నది, ఇదంతా కాల మహిమవల్ల సంప్రాప్తిస్తున్నదే గాని?! ఇతడు మన మేలును కోరి ప్రవర్తించేవాడే; మన చెడును కోరి-కావాలని చేసిన తప్పు యీగ కాలంత కూడా కనబడటం లేదు. చేయని తప్పును ఎవరి మీదా రుద్దకూడదు. కాలం ప్రతికూలం అయితే మనం తలపెట్టిన పనులన్నీ మనమీదికే ఎదురుతిరుగుతాయి. ఇతడు మనందరి దయకూ పాత్రుడు తప్పిస్తే, నిందకు తగినవాడు కాదు.

నువ్వు కూడా చాలా లోకాన్ని చూసినవాడివి; నీకు తెలీనిదంటూ యీ ప్రపంచంలో ఏదీ లేదు: గతించిన దాన్ని మళ్ళీ మళ్ళీ త్రవ్వటం నమిలినదాన్నే నమలటం అవుతుంది తప్పిస్తే అందులో సారం ఏమీ కనబడదు. దానికోసం దు:ఖించటంకూడా 'ఏరు దాటేశాక వంతెన కట్టటం'లాగా అనవసరమైన పని. అందుకని దాన్ని మానేసి, ఇప్పుడు ఏం చేయాలని నీకు తోస్తున్నదో-దాన్ని గురించి వివరంగా చెప్పు" అని. అప్పుడు ఆ చక్రవాకం రాజహంసతో ఇట్లా అన్నది- (ఏమన్నదో వచ్చేసారి...) ✷



# సాహస వీరుడి కథ

*పిల్లలు తలచుకుంటే చాలు- జానపద కథలు ఉరకలెత్తుతాయి. మరొక మహత్తర జానపద రచన, ఇదిగో..*
*రచన: ఆర్.సుబ్బారెడ్డి, 9 వ తరగతి, అభ్యాసవిద్యాలయం, విజయవాడ.*

అనగనగా ఒక రాజ్యం. ఆ రాజ్యంలో ఒక రాజు ఉండేవాడు. ఆ రాజుకు పిల్లలు లేరు. అందుకని రాణి ఎన్నో రోజులు ఉపవాసం ఉండి, ఎన్నో పూజలు చేసింది; ఎందరికో దాన ధర్మాలు చేసింది. రాజు రాజ్యాన్ని ఎంతో చక్కగా, ధర్మబద్ధంగా పాలించాడు.

ఒక రోజు ఆ రాజ్యానికి ఒక సాధువు వచ్చాడు. రాజు, రాణి సాధువు దగ్గరికి వెళ్ళారు. సాధువు ఆ దంపతులకు ఒక మామిడిపండు ఇచ్చాడు. "దీన్ని టెంకతో సహా తినెయ్యాలమ్మా, మరి ఎలా తింటావో నీ ఇష్టం!" అన్నాడు సాధువు.

రాణికి మామిడి పండ్లంటే ఇష్టమే; ఆమె దాన్ని తిన్నది- కానీ టెంకతో సహా తినమంటే ఎలాగ?

అందుకని ఆమె తను పండుని తిని, టెంకని మటుకు రాజభవనంలోంచి బయటికి విసిరేసింది.

అప్పటి నుండి తొమ్మిది నెలల తరువాత ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. అతనికి 'సాహసవీరుడు' అని పేరు పెట్టారు వాళ్ళు. అతనుకూడా పేరుకు తగ్గట్లే రకరకాల విద్యలు నేర్చుకున్నాడు. వాళ్ల రాజ్యంలో అతన్ని మించిన యోధులు లేరు అన్నట్లు తయారయ్యాడతను.

ఆలోగా, రాణి విసిరేసిన టెంక రాజ భవనం ప్రక్కనే మొలిచి, కాల క్రమంలో పెద్ద వృక్షమే అయ్యింది. దాని పళ్ళకు వింత శక్తి ఒకటి ఉన్నదని, త్వరలోనే అందరికీ తెలిసింది- వాటిని తిన్నవాళ్లకు అమితమైన శక్తి లభిస్తుంది!

అయితే "ఆ చెట్టు పండ్లు దుర్మార్గుల పాలబడితే ఎలాగ?" అని రాజుగారు దాని చుట్టూ కాపలా ఏర్పాటు చేసి, దాని పళ్ళు ఎవరికీ అందకుండా జాగ్రత్తలు తీసుకున్నారు.

అయితే ఒక నాడు రాజుగారి జైలులోంచి తప్పించుకున్న దుర్మార్గుడొకడు ఆ చెట్టు చుట్టూ ఏర్పరచిన సైనికులందరినీ ఏమార్చి, చెట్టును చేరుకున్నాడు. గబగబా ఆ చెట్టు కాయలు ఒక పదింటిని తినేశాడు కూడానూ. దాంతో వాడికి విపరీతమైన శక్తి వచ్చేసింది. వాడి శరీరం కూడా బలంగా, సైనికుల బాణాలకు దెబ్బతిననట్లు మారిపోయింది. దాంతో వాడు ఆ చెట్టుని కూకటి వేళ్లతో సహా పెకలించేశాడు; సైనిక వలయాన్నంతా చిందరవందర చేసి, దొరికిన వాళ్లనల్లా చంపేసి, రాజ్యంలో భీభత్సం సృష్టించటం మొదలుపెట్టాడు.

రాజ్యంలో ఎవరికీ వాడిని ఎదిరించే ధైర్యం లేకపోయింది. అందరూ రాజ్యాన్ని విడిచి పారిపోవటం మొదలుపెట్టారు.

సంగతి తెలిసిన సాహసవీరుడు రాజుగారిని కలిసాడు. తాను ఆ రాక్షసుడిని ఎదిరిస్తానన్నాడు. రాజుగారు పుత్రప్రేమను ప్రక్కనపెట్టి "సరే" అని అనుమతినిచ్చారు.

సాహస వీరుడు గ్రంథాలను వెతికి, ఆ చెట్టు గురించిన రహస్యాన్ని తెలుసుకున్నాడు: 'ఆ

కాయలు తిన్న వారికి అపరిమితమైన శక్తి వస్తుంది- కానీ, వాటిని తిన్నవాళ్ళు నీళ్ళలోకి దిగితే మటుకు వాళ్ల శక్తి క్షీణిస్తుంది!'

రహస్యం తెలిసాక సాహసవీరుడికి చాలా సంతోషం వేసింది. అతను ఆ దుర్మార్గుడితో పోరాడుతూ వచ్చి, మెల్లగా అతన్ని సముద్రంలోకి నెట్టాడు. దాంతో ఆ రాక్షసుడి శక్తి క్షీణించటం, అతను సాహస వీరుని కత్తికి బలవ్వటం జరిగిపోయింది. దుర్మార్గుడి కథ అట్లా అంతం కావటంతో అందరూ చాలా సంతోషించారు.

"మహిమలతో గొప్ప శక్తులు సంపాదించటం కంటే స్వశక్తిమీద ఆధారపడటమే మంచిది. అంత ప్రమాదకరమైన చెట్టుని భద్రంగా ఉంచి కాపాడుకుంటూ రారాదు- దాన్ని ముందుగానే నాశనం చేసేసి ఉంటే సరిపోయేది. అయినా మనం చేయాల్సిన పనిని ఆ దుర్మార్గుడే చేసాడు- చెట్టును పెరికివేసి చాలా మంచి పని చేశాడు!" అన్నాడు సాహసవీరుడు, సత్కారాలు అందుకుంటూ.

కవిత

అమ్మవోలే ఆదరిస్తాయి తరువులు
వాన వచ్చినప్పుడు గొడుగులా
ఆకలి వేసినపుడు తిండిలా
నిద్ర వచ్చినప్పుడు ఊయలగా
ఆడుకునే వేళలో ఆటబొమ్మగా
ఎండ ఉన్నప్పుడు నీడగా
ఉక్కగా ఉన్నప్పుడు విసనకర్రగా
ఆదరించే అమ్మలాంటి వృక్షాలని
అంతం చేయకురా మిత్రమా!

*రచన: సి.కృష్ణవేణి, 9వతరగతి, ప్రకృతిబడి.*




# పంతం రాముడు

మూలం: రమ్యశ్రీ, 10 వతరగతి, నందన గ్రామీణ పాఠశాల. పున: కథనం: కొత్తపల్లి

రామాపురంలో నివసించే బలరాముడికి 'పంతం రాముడు' అని పేరు. ఏమంటే వాడికి పంతం ఎక్కువ. ఏ పని చేసినా పంతం కొద్దీ చేసేవాడు వాడు.

"అట్లా పంతం పట్టాల్సిన అవసరం లేదురా, పంతంవల్ల చాలా శక్తి వృధా అవుతుంది" అని చెబుతుండేది, వాళ్ళ అమ్మ. అయినా వాడు ఆమెను పట్టించుకునేవాడు కాదు. తను ఏదనుకుంటే దాన్ని సాధించాలనే మనస్తత్వం వల్ల వాడంటే చాలా మందికి అయిష్టం ఏర్పడింది. వాడికి దగ్గరి స్నేహితులంటూ ఎవరూ లేకుండా పోయారు.

తన పంతం వల్ల ఎంత నష్టమో తెలిసింది వాడికి- కానీ ఏం చేస్తాడు, పంతం అలవాటైపోయింది మరి! అందుకని పంతం పట్టి అట్లాగే ఉండటం మొదలు పెట్టాడు

మారకుండా. పైపెచ్చు అందరికీ చెప్పేవాడు- "పంతంపట్టి చేస్తే ఏ పనైనా సాధించచ్చు. సమస్య ఏమిటంటే పంతం పట్టటం అందరికీ రాదు" అనేవాడు.

రామాపురంలో ఏటా వినాయక చవితిని గొప్పగా జరుపుకొనేవారు. వినాయకుడంటే బలరాముడికి కూడా చాలా ఇష్టం. ఆసారి వినాయకుడిని తమ వీధిలోనే పెట్టాలని పంతం పట్టాడు వాడు. కానీ ఊళ్ళోవాళ్లముందు వాడి పంతం ఎందుకు నెగ్గుతుంది? ఊళ్ళోవాళ్ళు ఎప్పటిమాదిరే ఊరి నడుమనున్న ఆటస్థలంలో వినాయకుడిని ప్రతిష్ఠిద్దామన్నారు.

దాంతో బలరాముడికి చాలాకోపం వచ్చింది. వాడు పూనుకొని, తనే ముందుపడి, వాళ్ళనుండి-వీళ్ళనుండి చందాలు సేకరించి, తమ వీధికోసమనే ప్రత్యేకంగా ఒక వినాయకుడిని తీసుకొచ్చాడు!

అట్లా వినాయకుడినైతే తెచ్చాడుగానీ, మరి దానికోసం పందిరి కట్టేదీ, పత్రిని తెచ్చేదీ, ప్రసాదాలు తయారు చేసేదీ- ఇవన్నీ వాడే ముందుండి చెయ్యాల్సి వచ్చింది. ఆ సమయానికి దేవుడే పంపినట్లుగా ఎవరెవరో వచ్చి వాడికి సాయం అందించారు; కానీ వాడికి ఎవ్వరినీ కలుపుకొని పోవటం రాదు: అలా వచ్చిన వాళ్లంతా 'వీడితో మనకెందుకు' అని వెనక్కి తగ్గారు. చివరికి ఇరవైనాలుగు గంటలూ దేవుడి పందిరిలోనే కూర్చొని కాపలా కాయాల్సి వచ్చింది వాడికి! సరిగ్గా తిండిలేక, నిద్రలేక చాలా బలహీనంగా తయారయ్యాడు వాడు.

"ఒరే! దేవుడి పని అందరిదీరా! అందరితో కలిసి పని చెయ్యాలి నువ్వానూ! నీ మాటే చెల్లాలని పంతం పడితే అసలుకే మోసం వస్తుంది!" అని వాళ్లమ్మ పోరుతుంటే వాడికి చాలా చికాకు వేసింది. "ఇప్పుడేమైందని? నేనే స్వయంగా వెళ్ళి నిమజ్జనం కూడా చేసి వస్తాను- ఎవ్వరి సాయమూ అవసరం లేదు నాకు" అన్నాడు వాడు.

చూస్తూండగానే తొమ్మిది రోజులు గడిచాయి. పంతం రాముడికి తన పంతం నెగ్గిందని తృప్తి కలిగింది. ఊళ్ళోవాళ్ళు వినాయకుడిని

మేళతాళాలతో ఘనంగా ఊరంతా ఊరేగించి, దూరంగా ఉన్న 'గిలకల బావి'లో నిమజ్జనం చేసేందుకు తీసుకెళ్ళారు. అది తెలిసాక రాముడికి తన వినాయకుడినీ అలా సత్కరించాలని సంకల్పం కలిగింది.

"నీ ఒక్కడి వినాయకుడేగదా, మన బావిలో నిమజ్జనం చేద్దాంలే" అన్నది వాళ్ళమ్మ. కానీ ఒకసారి పంతం పట్టాక వెనక్కి తగ్గే పిల్లవాడు కాదు కదా, వాడు?! తను కూడా ఆ వినాయకుడిని గిలకల బావిలోనే నిమజ్జనం చేస్తానని పట్టు పట్టాడు.

వినాయకుడిని తన సైకిల్ పైన కూర్చోబెట్టి, బ్యాటరీకి తగిలించిన టేపు రికార్డరులో బాజా బజంత్రీల క్యాసెట్టు వేసుకొని, ఊరంతా తిరిగి చివరికి గిలకల బావిని చేరుకున్నాడు వాడు. ఆ సరికి కొద్ది కొద్దిగా చీకటి పడుతున్నది. గిలకల బావి దగ్గర ఎవ్వరూ లేరు. బావిలో అంతకు ముందు ఊళ్ళోవాళ్ళు వదిలిన పూల దండలు- వగయిరాలు తేలుతున్నాయి. బలరాముడు తను తెచ్చిన వినాయకుడి విగ్రహాన్ని పైనుండే బావిలోకి గిరాటు వేసి, ఎక్కడ పడిందో చూద్దామన్నట్లుగా ముందుకు వంగాడు. ఏమైందో ఏమో మరి- మరుక్షణంలో వాడు బావిలోకి తలక్రిందులుగా పడిపోయాడు!



బలరాముడు ఊరి పిల్లవాడన్నమాటేగానీ, వాడికి ఈదటం ఏమాత్రం రాదు. నీళ్ళలో పడి వాడు రెండు మునకలు వేసి తన్నుకులాడేసరికి, అంతకు ముందు ఊళ్ళోవాళ్ళు వదిలిన వినాయకుడి విగ్రహం తగిలింది వాడి కాళ్లకు. వాడు తంటాలు పడి దాని మీదనే ఎక్కి నిల్చొని, "కాపాడండి! కాపాడండి!" అని అరవటం మొదలు పెట్టాడు.

అంతలో వాడు నీళ్ళలోకి వదిలిన వినాయకుడి విగ్రహం లేచి నిల్చున్నది- నీళ్ళలోనే!

"నువ్వు దేన్నిరా, నిమజ్జనం చేసింది?" వినాయకుడి గొంతు గిలకల బావిలో ప్రతిధ్వనించింది.

బలరాముడు బెదురుకున్నాడు. విగ్రహం మాట్లాడటం చూసి వాడికి మతి పోయినట్లు అయ్యింది.

"నువ్వు నిమజ్జనం చేయాల్సింది నీ దురలవాట్లనిరా, ఒట్టి మట్టి బొమ్మని కాదు! ఇంతకీ చెప్పు! నువ్వు ఈసారి వినాయక చవితి తర్వాత ఏ అలవాటును నిమజ్జనం చేస్తున్నావో చెప్పు!" అన్నాడు వినాయకుడు నీళ్లను అల్లల్లాడించుకుంటూ.

ఆ సందర్భంలో బలరాముడికి "శుక్లాంబర ధరం"కూడా గుర్తుకు రాలేదు- ఇంకేం చెబుతాడు, వినాయకుడికి?

"చెప్పు! ఊళ్ళో వాళ్లంతా కలిసి నన్ను కొలుస్తుంటే, నువ్వొక్కడివే వేరే దారి ఎందుకు పట్టావు? ఎందుకు నీకంత పంతం? నీ పంతాన్ని నిమజ్జన చేస్తానంటే చెప్పు, మీ వాళ్లనెవరినైనా రప్పించి నిన్ను కాపాడతాను" అన్నాడు వినాయకుడు.

"సరే సరే " అన్నాడు బలరాముడు, కాళ్లక్రింద విగ్రహం కరిగిపోతుంటే సర్దుకుంటూ.

అంతలోనే వాడు నీళ్లలోకి పడటమూ, వాళ్ళ చిన్నాన్న గబుక్కున వాడి చొక్కాని పట్టుకొని పైకి లాగటమూ జరిగాయి.

"నువ్విక్కడికి ఎట్లా వచ్చావు?" అని వాడు వాళ్ల చిన్నాన్నను అడిగే అవకాశమే లేకపోయింది. ఆయన వాడిని భుజాన వేసుకొని, బావికి ఉన్న మరల సందుల్లో కాళ్ళు పెట్టి పైకి ఎక్కి వచ్చాడు. అక్కడినుండి ఇంటికి వెళ్ళే వరకూ బలరాముడు ఏమీ మాట్లాడలేదు.

ఇక ఆ తర్వాత మెల్లగా వాడు అయినదానికీ-కాని దానికీ పంతం పట్టటం తగ్గిపోయింది!

"మావాడి పంతాన్ని తగ్గించి నువ్వు మాకెంత సాయం చేశావో చెప్పలేమురా!" అని బలరాముడి అమ్మ-నాన్నలు చిన్నాన్నను అభినందించారు గుట్టుగా.



# రాము సాహసం

*రచన: నితిన్‌గోపాల్, నవ్య, సుప్రజ, లింగారావుపాలెం.*

అనగనగా పెద్ద సముద్రం ఒడ్డున ఒక చిన్న ఊరు ఉండేది. సముద్రంలో రకరకాల చేపలు ఉంటాయి కదా; అందుకని ఆ ఊళ్ళోవాళ్లు అందరూ పడవలు వేసుకొని, సముద్రంలోకి వెళ్ళి, చేపలు పట్టేవాళ్ళు. వాళ్లలో రాము అనే జాలరి పిల్లవాడు ఒకడు ఉండేవాడు. వాళ్ళ నాన్నతో కలసి అతను కూడా రోజూ చేపలు పట్టడానికి వెళ్ళేవాడు.

ఒకసారి వాళ్ళ నాన్నకు జ్వరం వచ్చింది. అందువల్ల రాము ఒక్కడే చేపల వేటకు వెళ్ళాడు: అట్లా చేపలను పట్టుకుంటూ-పట్టుకుంటూ.. చాలా దూరం వెళ్ళాడు. సాయంత్రం అయ్యాక చూసుకుంటే తను ఏ ప్రాంతంలో ఉన్నాడో కూడా అర్థం కాలేదు! సముద్రంలోనే ఎక్కడో తప్పిపోయాడన్న-మాట! ఇప్పుడేం చేయాలి? చీకటి పడ-

వస్తున్నది. దూరంగా కొన్ని పక్షులేవో ఎగురుతూ కనబడ్డాయి.. అంటే అక్కడేదో భూభాగం ఉండి ఉండచ్చు! రాము పడవను ఆ వైపు పోనిచ్చాడు. నిజంగానే అక్కడొక దీవి ఉన్నది. దాని ఒడ్డు కూడా పడవలు ఆగేందుకు అనువుగా ఉన్నది.

రాము తను వచ్చిన పడవను ఒడ్డుకు చేర్చి, దాన్ని అక్కడే ఒక చెట్టుకు కట్టేశాడు. ఎలాగో ఒకలా ఆ దీవిమీదే రాత్రంతా గడిపి, ఉదయాన్నే వెనక్కి వెళ్ళే మార్గం చూసుకుందామనుకున్నాడు. కానీ అక్కడి సముద్ర తీరం పడుకునేందుకు అనువుగా లేదు; దీవి లోపలి పరిస్థితి తనకు తెలియదు. కొద్ది సేపు తటపటాయించిన తర్వాత, అతను దీవి లోపలికి వెళ్ళి చూడాల్సిందేనని నిశ్చయించుకున్నాడు.

దీవి అంతా నిర్మానుష్యంగా ఉన్నది. అక్కడక్కడా చిన్న చిన్న దుబ్బులూ, అడపా దడపా ఓ మోస్తరు ముళ్ళ చెట్లూ తప్ప, వృక్షసంపద కూడా పెద్దగా లేదు అక్కడ. అయితే త్వరలోనే రాముకి ఒక కాలి బాట దొరికింది! ఆ బాట వెంబడి నడుస్తూ పోయి, కొద్దిసేపటికి అతనొక గుహను చేరుకున్నాడు.

గుహ విశాలంగా, మనుషులు ఉండేందుకు చాలా అనువుగా ఉన్నది. దాన్నీ, కాలిబాటనూ చూస్తే, ఇక్కడెవరో మనుషులు నివసిస్తూ ఉన్నట్లుగానే అనిపించింది మరి. కానీ ఎంత శ్రద్ధగా విన్నా మనుషులు ఉన్న అలికిడేమీ వినబడలేదు, అతనికి!

అక్కడి నిశ్శబ్దానికి రాముకి కొంచెం భయం వేసింది. అయినా ధైర్యం తెచ్చుకొని గుహలోనే నడుస్తూ ముందుకు వెళ్ళాడు. గుహలో క్రమంగా చీకటి నిండుకున్నది. ఆకాశంలో చంద్రుడు కూడా రాలేదేమో మరి- గుహ చీకటి గుయ్యారంగా ఉన్నది.

చీకట్లోనే మెల్లగా గోడను పట్టుకొని అడుగులు ముందుకు వేస్తూ పోయాడు రాము. అకస్మాత్తుగా అతని కాళ్లక్రింద నేల జరిగినట్లయింది- దఢాలున ఒక సొరంగంలోకి జారి పడ్డాడతను! ఆ దెబ్బకు అతని కళ్ళు బైర్లు కమ్మాయి. ఎంత సేపు అలా పడి ఉన్నాడో తెలియదు. అతనికి మెలకువ

వచ్చేసరికి ఎక్కడినుండో వెలుగు మీద పడుతున్నది. బహుశ: తెల్లవారి ఉండాలి.

ఇంకొంచెం తేరుకున్నాక రాము చుట్టూతా కలయ చూశాడు. అక్కడ, అతని చుట్టూ చెల్లా చెదరుగా చాలా సంపద పడి ఉంది! బంగారు-వెండి నగలు, మెరిసే వజ్రాలు, మణులు- ఇంకా ఏవేవో పడి ఉన్నై; అక్కడంతా. అయితే అవన్నీ ఉండి ఏం లాభం? రాముకి ఆకలి వేస్తున్నది. దాహంగా ఉంది. "అక్కడ తినేందుకు, తాగేందుకు ఏవీ ఉన్నట్లు లేదు. ఇక్కడెవరు ఉంటారు? ఈ సంపదంతా ఇక్కడికి ఎలా వచ్చి చేరుకున్నది?" దేనికీ జవాబు మాత్రం దొరకలేదు.

రాము మెల్లగా లేచి నడుస్తూ తనకు కనిపించిన దారులన్నిటా తిరగటం మొదలు పెట్టాడు. అక్కడంతా ఎక్కడ పడితే అక్కడ సంపద కుప్పలు తిప్పలుగా పడి కనిపించింది. "ఈ సంపదలో కొంత తీసుకెళ్తే మా నాన్నను మంచి ఆసుపత్రిలో చూపించచ్చు" అనిపించింది వాడికి. అక్కడున్న నగల్లో నాలుగైదింటిని మాత్రం మూటగట్టుకొని బయట పడే మార్గం కోసం వెతుక్కుంటూ వెలుగు వస్తున్నవైపుగా అడుగులు వేయసాగాడు రాము.

నేలంతా తడి తడిగా అయ్యింది.. ముందు ఏదో నీటి కుంట ఉన్నట్లుంది- కొద్ది సేపటికి రాము ఆ కుంటలోంచే నడిచి పోవాల్సి వచ్చింది!



అయితే అంతలోనే అతని కాళ్ళకు ఏదో తగిలినట్లు అనిపించింది. 'ఏమిటా ' అని క్రిందికి చూశాడు: అక్కడ ఒక మనిషి పడివున్నాడు!

రాము భయంతో కెవ్వుమని అరిచాడు.

అంతటా నిశ్శబ్దంగానే ఉంది. తన ఊపిరి చప్పుడు తనకే తెలుస్తున్నది- దానితోబాటు మరొక శ్వాస కూడా!

రాము అటూ ఇటూ చూశాడు- ఎవ్వరూ లేరు...కానీ తనకు వినబడుతున్న శ్వాస ఎవరిది? మెల్లగా అతను క్రిందికి వంగి, తన కాళ్ళకు తగిలిన శరీరాన్ని పరిశీలనగా చూశాడు- నిజమే! ఆ శరీరంలో ప్రాణం ఉన్నది! శ్వాసిస్తున్నాడతను!

రాము గబగబా ఆ శరీరాన్ని కదిలించి చూశాడు. -ప్రయోజనం లేదు: అతను మంచి నిద్రలోనైనా ఉండి ఉండాలి; లేదా మూర్ఛ-పోయి ఉండాలి..

రాము వెనక్కి వెళ్ళి, నీటికుంటలోంచి కాసిని నీళ్ళు తీసుకువచ్చి అతనిముఖం మీద చల్లాడు.

చల్లటి నీరు తగిలాక కొంతసేపటికి ఆ మనిషికి మెలకువ వచ్చింది. లేచి కూర్చోగానే మొదట రాముని చూసి భయపడ్డాడతను.

రాము అతనికి కాసిని మంచినీళ్ళు అందించి, తేరుకోనిచ్చాడు. తర్వాత అతన్ని "నీ పేరు ఏమిటి? ఇక్కడకు ఎలా వచ్చావు?"-లాంటి ప్రశ్నలు అడిగాడు.

అతను చెప్పాడు, ఏడుస్తూ- "నా పేరు సోము. సముద్రంలో తప్పిపోయి ఇక్కడికి వచ్చాను. ఇక్కడ చాలా సంపద కనబడింది. నేను ఆ సొమ్మునంతా తీసుకుని బయలుదేరాను. అయితే ఎటు వెళ్ళాలో తెలీలేదు. ఈ గుహలోనే దారి తప్పి అటూ ఇటూ తిరగటం మొదలు పెట్టాను. అంతలో ఎక్కడినుండి వచ్చారో, మరి- కొందరు బందిపోట్లు వచ్చి మీద పడ్డారు. నన్ను కొట్టి ఇక్కడ పడేశారు. నిన్ను చూడగానే నువ్వూ వాళ్ళలో ఒకడివే అనుకున్నాను.." అని చెప్పాడు.

అంతలోనే గుహలో ఎక్కడినుండో "గర..గర.." మంటూ శబ్దం ఒకటి వినవచ్చింది. ఆ శబ్దం వినగానే సోము భయంతో వణికిపోతూ, నేలమీద బోర్లా పడుకున్నాడు. తనతోబాటు రాముని కూడా నేలమీదకి లాగి పడేసి, "చప్పుడు చేయకు"

అన్నట్లు నోటిమీద వేలు వేసుకున్నాడు. రాముకి పరిస్థితి అర్థమైంది. తనూ చప్పుడు చేయకుండా, కదలకుండా మొద్దులాగా పడి ఉండిపోయాడు.



అంతలోనే బందిపోట్లు అక్కడికి వచ్చి చేరుకున్నారు. అందరూ పెద్దగా ఏదో మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ వీళ్ళున్న చోటికి వచ్చారు. అయితే వీళ్ళ అదృష్టం బాగున్నట్లుంది- నేలమీద పడిఉన్న ఇద్దరినీ వాళ్ళు అస్సలు పట్టించుకోలేదు: తమతో పాటు మళ్ళీ ఏవేవో మూటలు తెచ్చినట్లున్నారు- వాటిని లోపల దాచి పెట్టి ఒక్కరొక్కరుగా అందరూ వెళ్ళిపోయారు.

రాము-సోములకు వాళ్ళు ఎటువైపుగా వెళ్ళారో చూసేందుకు కూడా ధైర్యం చాలలేదు. అయితే రాము తెలివిగా వాళ్ల అడుగుల చప్పుడును బట్టి ఏ దిశగా వెళ్ళారో గుర్తు పెట్టుకున్నాడు. దొంగలందరూ వెళ్లిపోయాక కూడా అట్లా ఇద్దరూ చాలా సేపు కదలకుండా పడి ఉన్నారు. ఆ తర్వాత ముందుగా రాము తలెత్తి చూసి, ఎవరూ లేరని నిర్ధారించుకొని, సోముని తట్టి లేపాడు. అంతకు ముందు విని ఉన్న శబ్దాల ప్రకారం దారిని ఊహించుకుంటూ మెల్లగా, జాగ్రత్తగా ముందుకు సాగారు ఇద్దరూ. కొంతసేపటికి ఇద్దరూ గుహలోంచి బయటికి రాగలిగారు!

బయటికి రాగానే రాము తను పడవను కట్టిన చెట్టు దగ్గరికి తీసుకెళ్ళాడు సోమును. పడవ అక్కడే, వదిలినది వదిలినట్లుగా ఉన్నది! దొంగలు ఆ పడవను చూసినట్లు లేదు- చూసి ఉంటే వాళ్ళు దాన్ని నాశనం చేసి ఉండేవాళ్ళేమో, మరి. ఇప్పుడు ఇద్దరూ

గబగబా ఆ పడవలోకి ఎక్కి, తెడ్లు వేసుకుంటూ సముద్రంలోకి ప్రయాణించారు.

రాము దారి తప్పాడుగానీ, సోముకి ఆ ప్రాంతాలన్నీ బాగా తెలిసినవే. అతను దారి చూపగా ఇద్దరూ త్వరలోనే రాము వాళ్ల ఊరి దగ్గరికి చేరుకున్నారు.

"సముద్రంలో ఎక్కడో అంత సంపద ఉందికదా, దాన్ని అలా పూర్తిగా వదిలేసి వచ్చామే; కనీసం వెళ్ళి ఆ సంగతి పోలీసులకు చెప్పి రావాలి! సోముని కూడావాళ్ళ ఇంటికి చేర్చాలి-" అనుకుంటున్నాడు రాము:

-అంతలోనే వాళ్లమ్మ వాడిని తట్టి లేపింది: "ఒరేయ్! రామూ! ఏంటిరా ఇంత మొద్దు నిద్ర?! ఇవాళ్టి నుండి బడికి వెళ్తానన్నావు; ఇంకా తయారవ్వలేదే, మరెలాగ?" అంటూ.

అప్పుడు అర్థమైంది రాముకి- 'ఇదంతా కల' అని!

"అబ్బ!కలలు ఎంత బాగుంటాయో కదా!" అనుకున్నాడు వాడు; లేచి కూర్చొని ఒళ్ళు విరుచుకుంటూ.

నవ్వు!

**ముదురు!**

టీచర్ (కోపంగా): రామూ! సోమవారం నుండి శుక్రవారం వరకు ఐదురోజులూ- హోంవర్కు చెయ్యకుండా వచ్చి తిట్లు తిన్నావు. నీ గురించి హెడ్మాస్టరు గారికి ఫిర్యాదు చేస్తాను. నువ్వు ఏం చెప్పుకుంటావో ఆయనకే చెప్పుకో.

రాము: నేనేం చెప్పుకుంటాను సార్, కనీసం శనివారం-ఆదివారం అన్నా బడికి శలవలు ఇచ్చినందుకు థాంక్స్ చెప్పుకుంటాను, అంతే!

కవిత

**నేనే, చెబుతున్నా!**

నాపేరు "మీన"

తెచ్చాను ఒక నీళ్ళ "బాన"

దాన్ని పెట్టాను "నేలపైన"

దీనిపై వాలింది "మైన"

గానం చేసింది ఆ "పైన"

గానం అర్థమైందా "ఇప్పటికైన"

*రచన: కె.శరత్‌చంద్రిక,7వతరగతి,శ్రీసాయినాథ్ స్కూలు, పాదలకూరు, నెల్లూరు.*



# మాయ దయ్యం

*రచన: యస్. యువరాజ్ భార్గవ్, 7 వతరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరుజిల్లా.*

అనగనగా కొత్తపల్లిలో ఒక పెద్ద రావి చెట్టు ఉండేది. ఆ చెట్టుకి కుడివైపుగా కొంత దూరంలో రామయ్య కుటుంబం నివసించేది. ఎడమ వైపుగా కొంత దూరంలో రమణమ్మ అనే అవ్వ ఒక్కతే ఉండేది.

అయితే ఆ అవ్వ కాస్తా రెండు నెలల క్రితం చనిపోయింది. అప్పటి వరకు చక్కగా ఉన్న ఆ ప్రదేశం అంతా అవ్వ చనిపోయేసరికి పాడుబడ్డట్లు అయిపోయింది. దానికి తోడు, ఇప్పుడు రావి చెట్టు పైనుండి వింత వింత శబ్దాలు వినబడసాగాయి!

"ముసలమ్మ దయ్యమై రావి చెట్టులో ఉంది" అని ఊళ్ళో వాళ్లంతా చెప్పుకోవటం మొదలు పెట్టారు. రోజూ రాత్రిళ్ళు ఆ శబ్దాలు వినీ వినీ రామయ్య కుటుంబం అల్లల్లాడిపోసాగింది. రామయ్య భార్య సీతమ్మ అయితే ఇల్లు

వదిలేసి వేరే చోటుకి వెళ్ళిపోదామని పోరటం మొదలు పెట్టింది. రామయ్య కొడుకు రవికి మాత్రం ఆ ఊరును వదిలి వెళ్ళటం ఇష్టం లేదు. ముఖ్యంగా తన స్నేహితులను వదలాలని లేదు వాడికి.

వాడు వాళ్ల టీచరును అడిగాడు "దయ్యాలంటే ఏమిటి టీచర్? అవి ఎట్లా ఉంటాయి? దేనితో తయారవుతాయి?" అని.

"దయ్యాలు అంటూ ఏవీ లేవు. అవి కేవలం మన ఆలోచనల్లో తయారౌతాయి. వాటినే భ్రమలు అంటారు. వాటికి భయపడటం అనేది మానసిక బలహీనతే తప్ప మరేమీ కాదు" అని వాళ్ళ సైన్సు టీచరుగారు చెప్పారు.

"కానీ 'దయ్యాలే లేవు- అంతా మనభ్రమ' అని అమ్మకు తెలియ జేసేది ఎట్లా?" ఎంత ఆలోచించినా రవికి అర్థం కాలేదు. ఎన్నో సార్లు అమ్మకి చెప్పాలని ప్రయత్నించాడు వాడు; కానీ లాభం లేకపోయింది. రోజు రోజుకి దిగులుతో కృంగిపోసాగింది సీతమ్మ.

కొడుకు తన మాటలు నమ్మటం లేదని ఒక రోజున సీతమ్మకి కోపం వచ్చింది: "నువ్వు ఏదైనా ఒక రోజు రాత్రి ఆ చెట్టు దగ్గరికి వెళ్ళి చూడురా, దయ్యం ఉందో లేదో నీకే తెలుస్తుంది!" అంది ఆపుకోలేక.

"సరే! నేను ఆ చెట్టు దగ్గరికి వెళ్ళి చూసి వస్తాను. దయ్యం ఎట్లా ఉందో చూసి, ఆ తర్వాతే మాట్లాడతాను నీతో" అని, ఆ రోజు రాత్రి రావి చెట్టు దగ్గరికి వెళ్ళాడు రవి.

అంతా చిమ్మ చీకటిగా ఉంది. దూరంగా హైవే మీదినుండి పోతున్న వాహనాల లైట్లకు చెట్టు పైభాగం మటుకు వింతగా వెలుగొందు-తున్నది. ఆ వెలుతురులో చెట్టు పైన నిజంగానే ఏదో ఒక వింత ఆకారం కనపడింది!

"ఏమిటది?" అనుకుంటూ ఒక అడుగు ముందుకు వేసాడు రవి. చేతిలో ఉన్న టార్చిలైటును వేసి అటువైపు తిప్పాడో లేదో- ఆ ఆకారం అర్థం కాని వింత శబ్దాలు చేస్తూ ఒక్కసారిగా వాడి మీదికి దూకింది. రవి చేతిలోని టార్చిలైటు క్రింద పడిపోయింది. వాడు భయంతో అరుచుకొంటూ వెనక్కి పరిగెత్తి ఇంటికి చేరాడు. ఇల్లు చేరినా వాడి

గుండె దడదడా కొట్టుకుంటూనే ఉన్నది.

"సైన్సుటీచరుగారు చెప్పింది సామాన్యంగా అబద్ధం కాకూడదు- అయినా మరి ఈ దయ్యాన్ని తను నిజంగా చూశాడు కదా, అది తన మీదికి దూకింది కూడాను! ఇప్పుడేం చెయ్యాలి?" అన్న ఆలోచనతో వాడికి ఇక నిద్ర పట్టలేదు.

క్రితం రోజు రాత్రి తను దయ్యాన్ని చూసిన సంగతి ఇంట్లో ఎవరికీ చెప్పలేదు వాడు. "ఆ దయ్యాన్ని ఎలా వెళ్ళకొట్టాలి?" అనే, ఇప్పుడు వాడి ఆలోచన అంతా: ఎందుకంటే రవికి ఆ ఊరన్నా , అక్కడి స్నేహితులన్నా, టీచర్లన్నా ఎంతో ఇష్టం. ఆ ఊరిని వదిలి వెళ్ళటం అనేది వాడికి అస్సలు ఇష్టం లేదు. "వీలైతే మా స్నేహితులందరినీ కూడగట్టుకుంటాను; అందరం కలిసి దయ్యాన్ని పారద్రోలతాం" అనుకున్నాక వాడికి కొంచెం హాయిగా అనిపించింది.

ఉదయాన్నే వాడు తన స్నేహితులందరినీ కలిసి జరిగిందంతా చెప్పాడు. తను ఇప్పుడు ఏం చేద్దామనుకుంటున్నాడో కూడా చెప్పి, వాళ్లని సహాయం చేయమన్నాడు.

"అమ్మో! మాకు భయం, మేము రాము" అన్నారు అందరూ భయంగా. వాళ్ళు అట్లా అనేసరికి పాపం, రవికి ఏడుపు వచ్చింది. వాడి బాధని చూసి స్నేహితులందరూ జాలి పడ్డారు. "ఏది ఏమైనా సరే- ధైర్యంగా వెళ్తాం. రవికి తోడుగా ఉంటాం. వెళ్ళి దయ్యాన్ని తరిమేస్తాం" అని నిర్ణయించుకున్నారు.



అనుకున్నట్లుగానే ఆరోజు రాత్రి అందరూ ఒక చోటున చేరారు. కట్టెలకు పాత బట్టలు చుట్టి, నూనె పోసి, దివిటీలు వెలిగించారు. వాటిని పట్టుకొని, అందరూ నిశ్శబ్దంగా రావి చెట్టుని

చేరుకున్నారు.

దివిటీల వెలుగులో దూరం నుండే అందరికీ కనబడింది చెట్టుమీది ఆ ఆకారం. పిల్లల్ని చూడగానే వికృత శబ్దాలు చేస్తూ వాళ్ల మీదికి దూకింది ఆ ఆకారం!

చురుకుగా ఉన్న పిల్లలు అంతలోనే గ్రహించారు- "ఒరే! ఇది గబ్బిలంరా! దయ్యం కాదు!" అని అరిచారు. ఆ సరికి గబ్బిలం వాళ్ల మీదికి దూకనే దూకింది. ఐతేనేమి, ఇప్పుడు పిల్లలకు అదంటే భయం పోయింది.

అది ఎంత భయపెట్టినా పిల్లలు మటుకు ధైర్యంతో నిలబడ్డారు. దివిటీలను దానిమీదికి గురి పెట్టి విసిరారు. అన్ని వైపులనుండి మండుతున్న దివిటీలు తగిలేసరికి ఆ గబ్బిలం ఎటూ పోలేక పోయింది. కాలి, క్రిందపడి, చచ్చిపోయింది!

పిల్లలంతా సంతోషంగా కేకలు వేయటం మొదలు పెట్టారు. దాంతో ఊళ్ళో వాళ్ళంతా లేచి పరుగెత్తుకుంటూ వచ్చారు అక్కడికి.

ముందుగా చేరుకున్నది రవి వాళ్ళ అమ్మే! రవి అమ్మకు గబ్బిలాన్ని చూపించి అన్నాడు- "ఇదేనమ్మా దయ్యం!" అని.

సీతమ్మ సంతోషంగా నవ్వి, రవిని దగ్గరకు తీసుకున్నది.

ధైర్య సాహసాలతో దయ్యాన్ని చంపేసిన పిల్లలందర్నీ ఊళ్ళోవాళ్ళు చాలా మెచ్చుకున్నారు. ✷

**తెలివి!**

నవ్వు!

రాము: నాన్నా, నువ్వు చీకట్లో- కళ్ళు మూసుకొని రాయగలవా?

నాన్న: ఓ! ఏం రాయమంటావు?

రాము: కళ్ళు మూసుకొని ఈ మార్కుల రిపోర్టు మీద నీ పేరు రాయి నాన్నా, చూద్దాం!



# ఉపాయం

*రచన: బి.లావణ్య, 6 వతరగతి, తేజ టాలెంట్ స్కూల్, కోదాడ, నల్గొండ జిల్లా.*

అనగనగా ఒక రైతు దగ్గర ఒక కోడి ఉండేది. రైతు పొలంలో దానికి కావల్సినన్ని తిండిగింజలు దొరికేవి. అక్కడే, ఒక చెట్టు మీద- ఒక పావురం కూడా నివసిస్తూ ఉండేది. కోడికి, పావురానికి మధ్య మంచి స్నేహం కుదిరింది. తనకు దొరికిన ఆహారాన్ని కోడి, పావురంతో పంచుకునేది. తను చూసిన వింతలన్నిటినీ పావురం, కోడికి చెబుతుండేది.

ఒకరోజు ఒక నక్క వచ్చింది అక్కడికి. అక్కడే గింజలు ఏరుకుంటున్న కోడిని చూసి అది ఆశ్చర్యపోయింది: "ఇంత పెద్ద కోడిని నా జన్మలో చూడలేదు! దీన్ని పట్టు కోగలిగితే నా స్నేహితులనందర్నీ విందుకు పిలుచుకోవచ్చు!" అనుకుంది.

ఆ సమయానికి రైతు కూడా దగ్గరలో లేడు. అందుకని అది అటూ-ఇటూ చూసింది; గబుక్కున ముందుకు దూకింది; కోడిని పట్టుకున్నది; తను తెచ్చుకున్న సంచిలో వేసేసుకున్నది; మళ్ళీ ఏమీ తెలీనట్లు మామూలుగా నడవటం మొదలుపెట్టింది.

ఇదంతా చూసింది, పావురం. అది చెట్టు మీద కూర్చున్నది కదా, దానికి అంతా కనిపించింది. "అయ్యో! ఈ దొంగనక్క నా స్నేహితుడిని ఎత్తుకెళ్లిపోతోందే! ఎలాగైనా కోడిని కాపాడుకోవాలి" అనుకుంది. "కానీ ఎలాగ? ఆ దొంగనక్కను ఎదుర్కొనేందుకు తన శక్తి సరిపోదుగదా?" అంతలో దానికి ఒక ఉపాయం తట్టింది.



వెంటనే అది వేగంగా ఎగిరి వెళ్ళి, ఏదో దెబ్బతిన్న దానిలా నక్క వచ్చే దారిలో నేల మీద పడింది. సంతోషంగా నడుస్తూ పోతున్న నక్క పావురాన్ని చూసింది: "వావ్! ఈ రోజు నా తోకను నేనే తొక్కుకుని వచ్చినట్టున్నానే! ఈ పావురం మాంసంతో పులుసు చేసి, కోడిపలావుతో కలిపి తింటే బలే ఉంటుంది!" అని లొట్టలు వేసుకుంటూ వంగి, ఒక చేత్తో పావురాన్ని పట్టుకోబోయింది. దాన్ని కనిపెట్టి ఉన్న పావురం కొంచెం పైకి ఎగిరి, ఇక ఎగరలేనిదానిలాగా కొద్ది దూరంలో మళ్ళీ నేల మీద పడిపోయింది.

ఇట్లా రెండు మూడు సార్లు అయ్యేసరికి, నక్కకు పరువు చేటు అనిపించింది. అది తన వీపు మీద ఉన్న గోనెసంచిని కింద పెట్టి, రెండు చేతులతోటీ పావురాన్ని పట్టుకునేందుకు ముందుకు దూకింది. వెంటనే పావురం "మిత్రమా! పారిపో! పారిపో!" అని గట్టిగా అరుస్తూ నక్కకు దొరక్కుండా పైకి ఎగిరిపోయింది. పావురం హెచ్చరిక వినిపించగానే కోడి గోనెసంచి లోంచి బయటకు దూకి పరుగుపెట్టింది. పావురం ధ్యాసలో పడిన నక్క కోడిని గమనించనే లేదు- అది వెనక్కి తిరిగి చూసే సరికి కోడి పరుగో పరుగు!




# విధి వ్రాత



*సేకరణ: సుంకర లీహ, కమలానగర్, అనంతపురం.*

దేవతల రాజైన ఇంద్రుడు ఓసారి కాశీ నగరంలో ఒక సమావేశం ఏర్పాటు చేశాడు. భూలోకంలోని రాజులు, ఋషులు, మామూలు ప్రజలు, జంతువులు, పక్షులు, కీటకాలు- అందరినీ ఆ సమావేశానికి ఆహ్వానించాడు. "అక్కడ ప్రతి ప్రాణీ తమ కష్టాల్ని నేరుగా దేవతలకు విన్నవించుకోవచ్చు" అని ప్రకటించాడు.

దాంతో చాలా మంది ఎక్కడెక్కడినుండో చేరుకున్నారక్కడికి. వరసగా అందరూ సభ లోకి వెళ్తున్నారు.

ఆ సభ వాకిలి మీద ఒక చిలుక వాలి ఉంది. ప్రతి ఒక్కరినీ మర్యాదగా పలకరిస్తున్నది అది. అందరూ దాన్ని చూసి ముచ్చట పడుతూ లోనికి పోతున్నారు.

ఇంద్రుడి పిలుపును అందుకొని యమ-

ధర్మరాజు కూడా వచ్చాడు, ఆ సభకు. యముడిని కూడా మర్యాదగా లోనికి ఆహ్వానించింది చిలుక.



యముడు మృత్యువుకు అధిపతి: ఏ ప్రాణి ఎప్పుడు, ఎక్కడ చచ్చిపోతుందో ఆయనకు తెలుసు. అట్లాంటి యముడు సభలోకి పోతూ-పోతూ, వెనక్కి తిరిగి మరీ ఆ చిలుక కేసి చూశాడు. పూర్తిగా లోనికి పోబోతూ మళ్ళీ ఓసారి ఆగి, చిలుక వైపుకు తిరిగి చూసి- నవ్వాడు కూడా!

అప్పటివరకూ సంతోషంగానే ఉన్న చిలుకకు ఇప్పుడు దిగులు మొదలైంది- "ఎందుకు, ఈ యముడు నన్ను చూసి ఎందుకు నవ్వాడు?" అని బెంగ మొదలైంది.

క్షణ క్షణానికీ దాని బెంగ ఎక్కువైంది. కొద్ది సేపట్లోనే అది నీరసపడిపోయింది. దానికి కళ్ళు తిరగటం మొదలు పెట్టాయి. వాంతి వచ్చినట్లయింది-

అంతలో పక్షిరాజు గరుత్మంతుడు అక్కడికి వచ్చాడు. ఆయన కూడా సభలోనికి పోబోతూ చిలుక పరిస్థితిని గమనించి పలకరించాడు- ఏం చిలకమ్మా, దిగులుగా ఉన్నావు? నీ సమస్య ఏమిటి? నాకు చెప్పు; నేను నీకు ఏ సాయం కావాలన్నా చేస్తాను" అన్నాడు.

చిలుకకు ప్రాణం లేచివచ్చినట్లయింది. "నీకు గాక ఇంకెవరికి చెప్పుకుంటాను స్వామీ! మా పక్షులందరికీ పెద్ద వాడివి నువ్వే కదా! అందుకని నా కష్టాన్ని నీకే చెప్పుకుంటాను. విను- ఇందాక యముడు సభ లోకి వెళ్ళాడు. నన్నే మళ్ళీ మళ్ళీ చూస్తూ పోయాడు. చివరికి వెనక్కి తిరిగి నావైపు చూసి నవ్వాడు కూడా!

నాకు భయం వేస్తున్నది. అతని నవ్వు గుర్తుకొచ్చినకొద్దీ నాకు ఈ భూమి మీద నూకలు చెల్లిపోయినట్లనిపిస్తున్నది. లేకుంటే అంతమందిలో నన్ను ఒక్కడినే వేరుచేసి ఎందుకు చూస్తాడు యముడు? నాకిప్పుడు మనసు మనసులో లేదు. ఇక ఎవ్వరినీ స్వాగతించలేను. ఎక్కడికన్నా వెళ్ళి దాక్కుందామనిపిస్తున్నది. నా వెంటపడి తరిమే మృత్యువుకి అందకుండా ఎక్కడికన్నా వెళ్ళిపోదామని ఉన్నది" గరుడుడికి చెప్పుకొని ఏడ్చింది చిలుక.

"ఓసి! ఇంతేనా! నువ్వు దిగులు పడకు! నిన్ను నేను కాపాడతాను. ఈ భూలోకంలో సురక్షిత స్థలాలకోసం వెతికి వేసారేదెందుకు? వేరే చోట ఎక్కడా అవసరం లేదు. మా పక్షి జాతి దానివి నువ్వు- ఎవరికీ అందకుండా నేను నిన్ను నేరుగా దేవలోకంలో విడిచి వస్తాను- పద; నీకెందుకు భయం!" అని గరుత్మంతుడు దాన్ని తన వీపు మీద ఎక్కించుకొని క్షణాల్లో దేవలోకం చేరుకు-న్నాడు. అక్కడ దాన్ని నందనవనంలో వదిలి-"బాగుందా, ఇక్కడ? ఏది కావాలన్నా ఊరికే కోరుకో చాలు- అది నీ సొంతం అవుతుంది. ఇక భయపడవుగా?! నేను సభకు వెళ్ళొస్తా మరి- ఉండు!" అని దాన్ని అక్కడ విడిచిపెట్టి పోయాడు.

సభంతా ముగిసిన తరువాత అందరూ బయలుదేరి బయటికి వస్తున్నారు. యమ-ధర్మరాజు కూడా బయటికి వస్తూ అంతకుముందు చిలుక కూర్చున్న వాకిలి వైపు చూశాడు. చిలుక అక్కడ లేదు! యముడి నొసలు ముడి పడ్డాయి. ఆయన అటు వైపు వెళ్ళి, చిలుక కోసం వెతకటం మొదలుపెట్టాడు.

అంతలో గరుత్మంతుడు అక్కడికి వచ్చి, యముడిని చూసి నవ్వాడు- "ఏమి యమధర్మరాజా! ఏదో వెతుకుతున్నావు?" అని అడిగాడు.

"ఈ వాకిలి మీద ఒక చిలుక ఉండింది ఇందాక- 'అది ఇప్పుడు ఎక్కడ ఉన్నదా' అని వెతుకుతున్నాను" అన్నాడు యముడు.

గరుత్మంతుడు గర్వంగా నవ్వాడు- "ఏమి,

దాని ప్రాణాలను తీసుకు పోదామనుకున్నావా? అది ఇప్పుడు ఇక్కడ లేదు.



నువ్వు ఇందాకదాన్ని చూసి నవ్వావట గదా- అది చాలా భయపడింది. అందుకని నేను దాన్ని తీసుకెళ్ళి, నీకు అందని చోట- దేవలోకంలో- దాచి వచ్చాను" అన్నాడు.

"అయ్యో! ఎంత పని చేశావు!" అన్నాడు యముడు, తలపట్టుకొని.

"ఏమైంది?" అడిగాడు గరుడుడు.

"ఇందాక నేను దాన్ని చూసి, దాని మరణం ఏవిధంగా ఉండనున్నదో చదివాను- 'కొద్ది సేపటిలో ఈ చిలుక దేవలోకంలో నీటమునిగి చనిపోతుంది' అని రాసి ఉంది దాని నుదుటన! 'భూలోకంలోని ఈ పక్షి దేవలోకానికి ఎట్లా పోతుంది? -అదీ కొద్ది సేపట్లో ఎట్లా పోతుంది?- పోయి అక్కడ ఎట్లా చనిపోతుంది? -అంతా అబద్ధం; జరిగే పని కాదు!' అనుకొని నవ్వాను నేను! చూడగా నువ్వు విధివ్రాతను నిజం చేసినట్లున్నావు- ఇప్పుడు అది ఎలా ఉన్నదో ఏమో!" అన్నాడు యముడు బాధగా.

ఆ సరికి నిజంగానే చిలుక దేవలోకంలో నీటమునిగి చనిపోయి ఉన్నది!

"చేతులారా చిలుకను మృత్యువు వాకిటికి చేర్చానే!" అని బాధపడుతున్న గరుడుడిని ఓదారుస్తూ యముడు అన్నాడు-"విధిని తప్పించటం ఎవరి తరమూ కాదు గరుడరాజా, నేను కూడా విధివ్రాతకు లోబడి వర్తించాల్సిందే!" అని.

# కుందేలు కాలు నొప్పి

*రచన: ఆనంద్, కొత్తపల్లిబృందం.*



అనగనగా ఒక అడవి. ఆ అడవిలో ఒక బుల్లి కుందేలు ఉండేది. ఒక రోజు ప్రొద్దున్నే అది నిద్రలేచి, తన పొదలోంచి బయటకు వచ్చి, ఒళ్ళు విరుచుకుంటూ అటూ ఇటూ చూసింది. అప్పుడప్పుడే తెలవారుతూ ఉంది. సూర్యుడి కిరణాలు పడి అడవి అంతా బంగారు రంగులో మెరిసి పోతూ ఉంది. అది చూసే సరికి బుల్లి కుందేలుకి బోలెడు సంతోషం వేసింది. ఆ సంతోషంలో కుందేలు చెంగు చెంగు మని గెంతులేస్తూ తనుండే పొద చుట్టూ తిరిగింది.



అంతలోనే దానికి చాలా ఆకలేసింది. చెంగుచెంగున గెంతుకుంటూ తినటానికి ఏమైనా వెతుక్కోవటానికి బయలుదేరింది.

ఏవో దుంపలు కొన్ని తిని, చెరువులో నీళ్ళు తాగి, మళ్ళీ చెంగుచెంగు మంటూ గెంతటం మొదలు పెట్టింది బుల్లి కుందేలు.

అటూ, ఇటూ , ఆ చెట్టు దగ్గరకి ఈ చెట్టు దగ్గరికి ,

ఆ రాయి మీదకు, ఈ ఆకు మీదకు గెంతులేస్తూ తిరిగింది, తిరిగింది, తిరిగింది, తిరుగుతూనే ఉంది. తిరిగి తిరిగి చివరకు కాళ్ళు నెప్పులు వచ్చేశాయి పాపం బుల్లి కుందేలుకి.



'అవునే, ఈ కాలు నెప్పితో ఇంటికెలా వెళ్ళాలి బాబోయ్!' అని అనుకుంటూ ఉంటే, ఎదురుగా నెమ్మదిగా నడుచుకుంటూ వస్తున్న తాబేలు కనిపించింది.

అప్పుడు కుందేలు తాబేలు దగ్గరకు వెళ్ళి "తాబేలు తాతా , తాబేలు తాతా, తిరిగి తిరిగి నా కాళ్ళు నెప్పిపుడుతున్నాయి. నెప్పి తగ్గాలంటే ఏంచేయాలో తెలుసా" అని అడిగింది.

అది విని తాబేలు "మీ కుందేళ్ళకు కాలి దురద ఎక్కువ. ఎప్పుడూ కాలుకాలిన పిల్లిలాగ అటూ ఇటూ గెంతుతూ ఉండకపోతే, మాలా నెమ్మదిగా నడవటం నేర్చుకోవచ్చు కదా? ఒకప్పుడు మీ తాత తను వేగంగా పరిగెత్తగలననుకొని, నాతో పరుగు పందెం వేసుకొని ఓడిపోయాడు తెలుసా? ఎప్పుడైనా నిదానమే ప్రధానం, ఊరికే పరుగులెత్తి ఏమీ సాధించలేరు" అని తన దారిన తను వెళ్ళిపోయింది.



'కాలు నెప్పి తగ్గటానికి ఏమైనా చిట్కాలు చెపుతుందేమో అనుకుంటే పెద్ద ఉపన్యాసం దంచేసింది. ఏమిటో!' అనుకుంటూ ఇంటి ముఖం పట్టింది కుందేలు. ఇంతలో ఒక ఏనుగు ఎదురొచ్చింది.



"ఏనుగు బావా, ఏనుగు బావా, తిరిగి తిరిగి కాళ్ళు నెప్పి పుడుతున్నాయి. తగ్గటానికి ఉపాయం ఏమైనా చెప్తావా" అని అడిగింది కుందేలు.

మంచి చెరుకుగడలు నాలుగు నమిలితే ఎలాంటి నెప్పైనా దెబ్బకి తగ్గిపోతుంది. అని చెప్పింది ఏనుగు. "అవునా? మరి చెరుకు గడలు ఎక్కడ దొరుకుతాయి? అని అడిగింది కుందేలు.

సూటిగా ఇటువైపు వెళ్ళితే, కొంచెం దూరం వెళ్ళేసరికి ఎదురుగా చెరకు తోటలు కనిపిస్తాయి" అని చెప్పి వెళ్ళిపోయింది ఏనుగు.



కష్టపడి లేచి ఓపిక తెచ్చుకొని, చెరుకు తోటకు బయలు దేరింది కుందేలు. తీరా వెళ్ళి చూసే సరికి ఆ చెరుకుని ఎలా తినాలో అర్థం కాలేదు కుందేలుకి. నోటితో కొరుకుదామని ప్రయత్నిస్తే, నోరు నెప్పి పుట్టింది. కానీ చెరుకు మాత్రం, కొరుకుడు పడలేదు. "లాభం లేదులే !" అని

దాన్ని వదిలేసి, మళ్ళీ ఇంటిముఖం పట్టింది కుందేలు.



వెళుతూ ఉంటే, ఒక చీమ ఎదురొచ్చింది. "చీమక్కా, చీమక్కా, తిరిగి తిరిగి కాళ్ళు నెప్పిపుడుతున్నాయి. నడవలేక పోతున్నాను, బలానికి ఏమైనా ఉపాయం తెలిస్తే చెప్పవా?" అని అడిగింది కుందేలు.

"కాళ్ళు నెప్పి పుడితే, 'కాళ్ళ నెప్పి' అని అందరితోటీ అంటూ కూర్చోకూడదు. నోరు మూసుకొని చెప్పిన పని చేసుకుంటూ పోవాలి అంతే, నాకు పనికి ఆలస్యం అవుతుంది, వెళ్ళొస్తా" అని చీమ వెళ్ళిపోయింది.

కుందేలుకు ఏమీ అర్థంకాక, బుర్రగోక్కొని మళ్ళీ ఇంటి దారి పట్టింది. వెళుతూ వెళుతూ ఉంటే ఎలుగుబంటి ఎదురొచ్చింది.

ఈ ఎలుగుబంటైనా ఏదో ఒక చిట్కా చెప్పకపోతుందా అని, "ఎలుగు మామా! ఎలుగు మామా! తిరిగి తిరిగి కాళ్ళు నెప్పి పుడుతున్నాయి. నెప్పులు తగ్గటానికి ఉపాయమేమైనా చెప్పవా?" అని అడిగింది కుందేలు.



"తేనె దివ్యౌషధం అల్లుడూ! ఎలాంటి నెప్పులయినా చిటికెలో తగ్గిపోతాయి!" అని చెప్పింది ఎలుగుబంటి. "అవునా? మరి తేనె ఎక్కడ దొరుకుతుంది" అని అడిగింది కుందేలు.

"అదిగో ఆ పెద్ద చెట్టు కనిపిస్తుంది చూశావా, ఆ చెట్టుకు ఒక పెద్ద తేనె పట్టు ఉంది" అని చెప్పింది ఎలుగుబంటి.

కుందేలు అక్కడికి వెళ్ళి, పొడుగాటి కర్ర ఒకటి తీసుకొని, ఆ తేనె పట్టుని చటుక్కున కదిలించింది. అంతే- తేనెటీగలన్నీ ఝుమ్మని ఒక్క సారిగా లేచి కుందేలు వెంటపడ్డాయి- కుందేలు బెదిరిపోయి ఒకటే పరుగు- తన పొదలోకి వచ్చి దూరినా ఆపలేదు!




ఇంట్లోకి వచ్చి ఆయాసం తీర్చుకునే సరికి, ఆ అలసటకి నిద్రముంచుకొచ్చేసింది. ఒళ్ళు తెలియకుండా నిద్రపోయింది కుందేలు.

తెల్లారి లేచి చూసుకుంటే కాళ్ళు నెప్పి మాయమయిపోయింది!

"ఓహో! ఒళ్ళు నెప్పులన్నీ నిద్రపోతే తగ్గుతాయన్నమాట!" అనుకొని, మళ్ళీ చెంగు చెంగున గంతులు వెయ్యటం మొదలు పెట్టింది కుందేలు పిల్ల.

**ఫ్లూటు సాధన!**

నవ్వండి!

శీన: మీరు ఫ్లూటు సాధన చేస్తుంటారా?

గోపి: అవునండీ, మీరెలా కనిపెట్టారు?

శీన: మీ పక్కింటాయన ఎప్పుడూ చెవిలో దూది కావాలని వస్తుంటారు గదా, అట్లా కనుక్కున్నా!




# సుడిగాలి దెయ్యం



*రచన: యస్.శంకరశివరావు, ఇంద్రజాలకుడు/ఉపాధ్యాయుడు, బద్దలాపురం, కనగానపల్లి*

మంజుల, వాళ్ల తమ్ముడు 'ఫండు '- ఇద్దరూ మారాల హైస్కూల్లో చదువుతున్నారు. అది ఏప్రిల్ నెల- ఒంటిపూట బడి. ఎర్రటి ఎండ. ఆ ఎండలో రెండు కిలోమీటర్లు నడవాలి. గుండ్లవాగులో నీళ్ళు చుక్క ఉండదు. దాన్ని దాటాక చింతతోపు వస్తుంది.. చింతతోపు అవతల ఉంది బడి.

ఎప్పటిలాగే ఆ రోజునా బడికి బయలు దేరారు అక్కా-తమ్ముడూ. అంతలోనే పెద్దగా శబ్దం చేస్తూ వచ్చింది- సుడిగాలి! దుమ్ము-ధూళి, చెత్తా-చెదారం- ఏది దొరికితే దాన్నల్లా తీసుకుని, ఆకాశాన్ని తాకుతూ వచ్చేసింది చింత తోపులోకి!

మంజుల పరుగెత్తి చింత చెట్టు మాటున దాక్కుంది. ఫండు మాత్రం ఆ 'సుట్ర గాలి'లో చిక్కుకున్నాడు. బయటికి రాలేకపోయాడు

పాపం.. పెద్దగా అరుస్తూ కింద పడిపోయాడు. వాడినే చూస్తున్న మంజుల పరుగెత్తి వెళ్ళి వాడిని కాపాడాలనుకుంది. కానీ భయంతో ఆ పాప కాళ్ళు నేలకు అతుక్కుపోయాయి!

కొంతసేపటికి ఆ సుడిగాలి వెళ్ళిపోయింది. ఫండు మటుకు ఇంకా నేలమీదే పడి ఉన్నాడు. చెట్టు చాటు నుండి పరుగున వచ్చి, ఫండును లేవనెత్తింది మంజుల. వాడు భయంతో బిగుసుకుపోయి ఉన్నాడు; ఇంకా తేరుకోలేదు. కళ్ళు తెరిచాడుగానీ, దేన్ని చూస్తున్నాడో అర్థం కావటంలేదు. మంజుల వాడిని ఏమి అడిగినా జవాబు రాలేదు- చివరికి ఆ పాప వాడిని తీసుకొని ఇంటికి వచ్చేసింది.

ఇల్లు చేరుకోగానే వాడు వెళ్ళి అరుగు మీద పడుకున్నాడు. మధ్యాహ్నమైనా లేవలేదు. "బువ్వ తినకుండా పడుకున్నావేందిరా?" అడిగింది వాళ్ళమ్మ పార్వతి. "వాణ్ని సుట్రగాలి కింద పడేసిందమ్మా!" జవాబిచ్చింది మంజుల.

అది వినగానే పార్వతమ్మ చేతిలో ఉన్న గిన్నెను నేలమీద పడేసి ఏడవటం మొదలుపెట్టింది- "అయ్యో! నాయనో! నాకొడుక్కి పెద్ద పిశాచి సోకిందిరో!" అని పెద్దగా అరవసాగింది.

వాళ్ళ నాన్న భీమన్న గబుక్కున వచ్చాడు- ఫండును ఒళ్ళో పడుకోబెట్టుకున్నాడు. ఫండు ఒళ్ళు వేడిగా ఉంది. ఏదేదో గొణుగుతున్నాడు- అర్థం పర్థం లేకుండా. మధ్య మధ్యలో ఏడుస్తున్నాడు. మళ్ళీ తనంతట తనే సర్దుకుంటున్నాడు.

ఈ లోపల పార్వతి పరుగున పోయి మారాల భూతవైద్యుడిని పిలుచుకు వచ్చింది.



భూతవైద్యుడు నాగులయ్య వచ్చీ రాగానే కాస్తంత సున్నం తెమ్మన్నాడు. ఫండు అరచేతిలో సున్నం పెట్టాడు. నీళ్ళతో తేమ చేశాడు.

ఏదో మంత్రం చదువుతూ చూపుడు వేలితో సున్నాన్ని కలిపాడు. అంతే- సున్నం గులాబి రంగులోకి మారింది! దాన్నే చూస్తున్న పార్వతమ్మ సన్నగా ఏడుపు లంకించుకున్నది. భీమన్న ముఖం జేవురించింది. నాగులయ్య ఏదో అర్థమైనట్లు సంతృప్తిగా లేచాడు- "చూశారుగా?! వీడిని బేతాళ పిశాచి ఆశించింది. బేతాళ దోషం అంటే మామూలుది కాదు. అది పోవాలంటే ముగ్గు పోసి అమావాస్య నాడు పూజ చేయాలి. ఐదువేల రూపాయలు ఖర్చు అవుతుంది" అని చెప్పాడు.

"అంత ఇవ్వలేం! బీదోల్లం!" అని మొత్తుకున్నారు తల్లిదండ్రులు. చుట్టు ప్రక్కల వాళ్ళందరూ సర్దిచెప్పాక, చివరికి అసంతృప్తిగానే రెండువేలకు బేరం కుదుర్చుకున్నాడు నాగులయ్య.

భీమన్న చేతిలో డబ్బులు లేవు. అప్పటికప్పుడు వడ్డీ వ్యాపారి "సన్నమెడ గోవిందు" దగ్గరికి పోయి డబ్బు తెచ్చాడు అప్పుగా. నాగులయ్య ఆ డబ్బును తీసుకున్నాడు- "పట్నం పోయి పూజా సామగ్రి తెస్తాను. అమావాస్య నాటి రాత్రి పూజ! సిద్ధంగా ఉండండి మరి!" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఫండుకు బాగా లేదన్న సమాచారం పట్నంలో చదువుతున్న "డౌను" అన్నను చేరింది. డౌను భీమన్నకు ఫోన్ చేసి, సంగతంతా కనుక్కున్నాడు. "పూజ ఎప్పుడు చేస్తాడంట?" అడిగాడు భీమన్నను.

"వచ్చే అమావాస్య రోజున!" చెప్పాడు భీమన్న. "నేనూ వస్తానులే, ఆరోజు పూజకు!" చెప్పాడు డౌను. "సరే, రా! అంతకంటేనా?" అన్నాడు భీమన్న.

అమావాస్య రానే వచ్చింది. పూజకు అంతా సిద్ధం చేశాడు నాగులయ్య. గది మధ్యలో ఏదో వింత ఆకారంలో ముగ్గు పోశాడు. దాని మీద అక్కడక్కడా కొంచెం బియ్యం పోశాడు. అంతలో అకస్మాత్తుగా "ఓసారి ఆగు పెద్దయ్యా!" అన్నాడు డౌను. "ఏదీ, నీ అరచేయి చాపు, ఓసారి!" అన్నాడు.

నాగులయ్య చెయ్యి చాపాడు.



పార్వతమ్మ అతని అరచేతిలో సున్నం వేసి తేమ చేసింది.

డాసు అతని ముందు నిలబడి, గట్టిగా ఏదో అరుస్తూ ఆ సున్నాన్ని తన చూపుడు వేలితో రుద్దాడు. ఆశ్చర్యం! అది గులాబి రంగులోకి మారింది! నాగులయ్య ఖంగుతిన్నాడు.

"ఇప్పుడు చెప్పండి పార్వతమ్మక్కా!? బేతాలుడు ఎవరికి సోకినాడు?" అడిగాడు డాసు.

పార్వతమ్మ, భీమయ్యల నోట మాట రాలేదు. అక్కడ చేరిన వాళ్లంతా నాగులయ్యకేసి అనుమానంగా చూశారు. కొందరు అడుగు ముందరికి వేసి అతన్ని కొట్టేందుకు సిద్ధపడ్డారు.

నాగులయ్య తన మోసాన్ని ఒప్పుకున్నాడు; భీమన్న కాళ్ళ మీద పడి క్షమించమని అడిగాడు. "ఇలా బీదవాళ్ళకు ఎన్నడూ అన్యాయం చెయ్యొద్దు, చెబుతున్నాను చూడు!" అని అతన్ని మందలించి పంపాడు డాసు.

అతను అటు పోగానే భీమన్న అడిగాడు- "పాపోడా! అచ్చం నాగులయ్య చేసినట్లే ఎలా చేసావయ్యా?!" అని.

"ఏమీ లేదు పెద్దయ్యా! బేదులు(విరేచనాలు) అయ్యేందుకు మాత్రలు దొరుకుతాయి దుకాణాల్లో- 'పర్గోలాక్స్' అని- ఆ మాత్రను ఒకదాన్ని బాగా మెత్తగా నూరి, పొడి చేసి, ముందుగానే చూపుడు వేలికి రుద్దుకోవాలి. సన్న పొడి కదా, అందుకని అది పైకి కనబడదు. ఆ తర్వాత సున్నాన్ని తేమగా చేసి, ఆ వేలితో రుద్దామనుకో, అప్పుడు రసాయనిక చర్య జరుగుతుంది. సున్నం గులాబి రంగులోకి మారుతుంది! అంతే! ఇందులో ఉన్నది చాలా మామూలు సైన్సు! పాదాలకు పసుపు

రాసుకొని, దానిమీద సున్నంతో గీతలు గీస్తే ఎర్రటి పారాణి తయారవ్వట్లేదూ? అలాగన్నమాట!" చెప్పాడు డాసు, పర్గోలాక్స్ మాత్ర కవరును చూపెడుతూ.

"మరి సుట్రగాలిలో దయ్యం ఉంటుంది గదరా? లేకపోతే సుడిగాలిలో పిల్లలు అలాగ ఎందుకు అయిపోతారు?" అడిగింది పార్వతమ్మ.

"అలాంటిదేమీ లేదమ్మా! ఎండాకాలంలో వాతావరణం వేడెక్కుతుంది గదా; అట్లా వేడెక్కిన గాలి తేలికౌతుంది. తేలికైన గాలి పైకి ప్రయాణిస్తుంది. అయితే, అది ఖాళీ చేసిన ప్రాంతంలో పీడనం తగ్గిపోతుంది. గాలి లక్షణం ఏంటంటే, ఎక్కువ పీడనం ఉన్న చోటినుండి అల్పపీడనం ఉండే ప్రాంతానికి వేగంగా దూసుకొని రావటం. అట్లా అన్ని వైపుల నుండీ దూసుకొచ్చిన గాలి ప్రవాహాలు ఒక దాన్ని మరొకటి ఢీకొని, సుడి తిరుగుతూ పైకి లేస్తాయి. వాతావరణంలోని మార్పుల వల్ల అట్లా సుడిగాలులు ఏర్పడతాయనమాట. గాలులు ఎంత వేగంగా వస్తాయన్నదాన్ని బట్టి, ఇవి చాలా బలంగా కూడా ఉండచ్చు. ఒక్కోసారి వీటి తాకిడికి పెంకుటిళ్ళ కప్పులూ దెబ్బతింటాయి! వేసవికాలంలో మైదాన ప్రాంతాల్లో తరచుగా వస్తాయి ఇవి. ఇదంతా తెలీదుగా, మనకు? అందుకనే, ఇదిగో- ఈ నాగులయ్య లాంటి వాళ్ళు 'దయ్యం, భూతం' అని చెప్పి, మనల్ని భయపెట్ట-గల్గుతున్నారు. మూఢనమ్మకాలను ఇంకా వ్యాప్తి చేయగల్గుతున్నారు" వివరించాడు డాసు.

"మరి ఏమంటావురా, ఫండుకు ఏం కాదుగా?" అడిగాడు భీమన్న.

"వాడు భయపడ్డాడు- అంతే, పెద్దయ్యా! ధైర్యం చెబితే కోలుకుంటాడు. పిల్లలు బాగా భయపడితే తేలికపాటి జ్వరం వస్తుంది కదా, ఇదీ అలాంటిదే. తగ్గిపోతుందిలే" అన్నాడు డాసు.

"ఇలాంటి విషయాలు చెప్పేవాళ్ళు లేక, మేం అందరం ఇట్లా మోసపోతున్నాం పాపోడా!" అని పార్వతి, భీమన్నలు కృతజ్ఞతలు చెప్పుకున్నారు డాసుకు.



# సమస్య-సమాధానం

*రచన: జయరామిరెడ్డి, టైలరు, చెన్నేకొత్తపల్లి.*



కొత్తపల్లిలో ఉండే రాముకు లేని బాధ లేదు: చదువు బాగా రావటంలేదు; ఆర్థిక పరిస్థితి బాగాలేదు; తండ్రి లేడు; తల్లి ఆరోగ్యం బాగాలేదు; తనకు కూలి పనులు చేయబుద్ధి కావట్లేదు; అందరిచేతా తిట్లు తినక తప్పటం లేదు.. ఇట్లా ఏవేవో కష్టాలు.

అట్లా అని వాడి మనసులో ఆనందమే లేదా, అంటే అట్లా ఏమీ కాదు. వాడికి ఈత కొట్టటం వచ్చు, పొలానికి నీళ్ళు పెట్టటం అదీ వచ్చు, నాట్లు వేయటం, కలుపు తీయటం వచ్చు, ఇంకా చాలా పనులు వచ్చు.

అయితే ఊళ్ళో జనాల నోరు ఊరికే ఉండదు గదా, ఒకసారి వాడిని కూర్చోబెట్టుకొని ఎవరో పెద్దాయన సానుభూతి వర్షం కురిపించాడు-

"పాపం, నీకెన్ని కష్టాలు వచ్చి పడ్డాయిరా బాబూ!" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

దాంతో వాడికి చాలా దిగులు వేసింది. 'తనకి నిజంగానే ఎన్ని కష్టాలో' అనిపించింది. ఊరి బయట ఒక చెట్టుకింద కూర్చుని ఖాళీగా ఏదో ఆలోచిస్తూ ఉన్నాడు. ఆ సమయంలోనే ఊళ్లోవాళ్ళు కొందరు అడవికి వెళ్తున్నారు. వాళ్లు రాముని చూసి- "ఏమి నాయనా, ఇక్కడ కూర్చున్నావు?" అని పలకరించారు. రాము సమస్యల పట్టికను విప్పగానే వాళ్ళన్నారు- "చూడు రామూ, మేమందరం కూడా నీలాగానే సమస్యలతో దిక్కుతోచక, అడవిలో ఉన్న స్వామిని కలవడానికి వెళ్తున్నాము. నువ్వు కూడా వచ్చేయి" అని.

వెంటనే రాము బయలుదేరి వెళ్లాడు వాళ్లతోబాటు. స్వామి అతని సమస్యలన్నీ ఓపికగా విని, "చూడు రామూ! సమస్యలు లేకుండా జీవించడం చాలా చాలా సులువు: ఎవ్వరి మాటలూ పట్టించుకోకూడదు; మన పని మరవకూడదు. ఈ రోజునుంచి తెల్లవారుజామున 4.30 కల్లా నిద్రలేచి, వార్తా పత్రికలను ఇంటింటికి చేరవెయ్యి.



దాంతో నీకు రోజూ వాకింగ్, రన్నింగ్, అన్నీ అయిపోతాయి; దాంతోబాటు నీకు నెలకొక 400 రూపాయలు కూడా వస్తాయి!

ఇక మీ ఇంటి ప్రాంగణంలోనే కూరగాయల పాదులు, ఆకుకూరలు పెట్టు. బడినుంచి సాయంత్రం ఇంటికి రాగానే బిందెతో నీళ్లు తెచ్చి పొయ్యి, వాటికి. మధ్యాహ్నం సమయంలో మీ అమ్మ వాటిని సంరక్షిస్తుంది.

ఒకసారి కాత మొదలవ్వగానే వాటిని ఇంటింటా తిరిగి అమ్ము.

మీ అమ్మ కష్టాలను ఇంకొన్నాళ్లలో తీర్చాలి నువ్వు- కష్టపడి పనిచెయ్యి- అంతా మేలు జరుగుతుంది. ప్రతి పనినీ ఆనందంగా చేయి, అఖండ విజయం నీదే! వెళ్ళిరా, విజయంతో తిరిగిరా!" అన్నాడు.

రాముకొక మార్గం దొరికినట్లయ్యింది. వాడు స్వామి చెప్పినదాన్ని వెంటనే అమలు పరచాడు. రకరకాల కూర కాయల మొక్కలు పెంచాడు. మురుగు నీరు పోయే దగ్గర బొప్పాయి చెట్లు పెట్టాడు. వాటిని జాగ్రత్తగా సంరక్షించుకుంటూనే, ఉదయంపూట వార్తా పత్రికలను ఇంటింటికి చేరవేసే పని మొదలు పెట్టుకున్నాడు.

రెండు నెలలు గడిచాయో, లేదో- కూరగాయలు, ఆకుకూరలు తమ ఇంటి అవసరాలకే కాక అమ్మేందుకు తగినన్ని వచ్చాయి. మూడవనెలలో ఆ డబ్బులతోటే వాళ్లమ్మచేత చిన్న వ్యాపారం మొదలు పెట్టించాడు రాము: "ఈ రోజు నుంచి నువ్వు రాగి, జొన్న రొట్టెలు, చక్కిలాలు, అత్తిరసాలు(అరిసెలు) చెయ్యి. నేను ప్రతి ఆదివారం మన చుట్టు ప్రక్కల పల్లెలకు వెళ్లి వాటిని అమ్ముకొని వస్తాను" అని.

ఇలా శ్రమపడి పదో తరగతి గట్టెక్కాడు. ప్రతినెలా 4 వేల రూపాయలు సంపాదించు కోగలిగాడు. దాంతో వాడి జీవితం ఒక గాటన పడ్డట్లయింది.

అయితే ఈ దెబ్బతో వాడు స్వామీజీకి దాసుడు అయిపోయాడు. ప్రతి చిన్న సమస్యకూ వాడు స్వామీజీ దగ్గరికి పరుగెత్తటం మొదలైంది. వాడి వెనకనే ఊళ్ళోజనాలు! మొదట్లో కొంచెం ఉల్లాసపడ్డా, రాను రాను స్వామిజీ కూడా వాళ్లని చూడగానే పారిపోవటం మొదలు పెట్టాడు. చివరికి ఒక రోజున ఆయన మరో చోటికి ఎక్కడికో పయనమై పోయాడు!

ఇప్పుడు రాముకు కొత్త కష్టాలు మొదలయ్యాయి. వాడిప్పుడు పెద్దవాడ-య్యాడు; పెళ్లి చేసుకున్నాడు. వాడి భార్యది పెద్ద గొంతు. 'గై..గై..గై' అని ఎప్పుడూ

అరుస్తూ ఉండేది. ఊళ్ళో వాళ్లందరితోటీ గొడవలు పెట్టుకునేది. ఆ దెబ్బకు రాముకు మళ్ళీ స్వామీజీ గుర్తుకొచ్చాడు. "తను కూడా సన్యాసి అయిపోతే ఎలా ఉంటుంది!" అనిపించింది వాడికి. అయితే అడవిలో ఎంత వెతికినా స్వామీజీ కనబడనే లేదు. చివరికి వేరే ఏదో ఊళ్ళో టైలరు పని చేస్తూ కనిపించాడాయన!



"ఇదేమి స్వామీ, ఇట్లాగ?" అన్నాడు రాము ఆశ్చర్యపోతూ.

"నేను ఇప్పుడు టైలరును నాయనా! నీకేమైనా చొక్కాలు కావాలంటే చెప్పు-కుట్టి పెడతాను. అంతకంటే మరేమీ అడగకు" అన్నాడు స్వామి వాడితో.

"ఇట్లా అయితే నేను ఊళ్ళో వాళ్ళందరినీ పిలుచుకొచ్చేస్తాను" అని బెదిరించిన మీదట, ఆయన చెప్పాడు- "చూడు రామూ! నేను నీకు చెప్పాను కదా, 'ఎవ్వరి మాటలూ పట్టించుకోకూడదు; మన పని మరువకూడదు' అని? అయితే నేను నా జీవితంలో ఆ పని చెయ్యలేదు. భార్యాపిల్లల్ని, వృత్తినీ వదిలేసి, సన్యాసి వేషంలో ఊరూరా తిరిగాను. తీరా తెలివి వచ్చి చూస్తే ఏమయింది? కుటుంబం అంతా గందరగోళమే అయ్యింది. పిల్లలు ఊరికొకరు- పుట్టకొకరుగా చెదిరిపోయారు. భార్య ఎన్నో కష్టాలనడుమ చనిపోయింది. అప్పుడు నాకు అర్థమైంది. మన పనిని మనం మరువనే కూడదు; ఎన్ని కష్టాలు వచ్చినా బాధ్యతలనుంచి పారిపోకూడదు" అని.

రాముకి కళ్ళు తెరుచుకున్నట్లయింది. "ఈ ప్రపంచంలో ఉన్న వాళ్లందరికీ ఏదో ఒక సమస్య ఉంటుంది. కానీ 'సమస్య-సమస్య-' అని జపం చేసేవాళ్లకి అది తీరనే తీరదు. ఓపికగా, తెలివిగా వాటిని పరిష్కరించుకోవాలి అంతే.

భార్య పెద్ద గొంతుతో అరవటం తనకు సమస్యగా ఉంది. మరి తన ఇంటి ప్రక్కనుంచే లారీలు, బస్సులు అంతకన్నా పెద్ద శబ్దాలు చేస్తూ పోతున్నాయి కదా, అవి తనకు సమస్య కాలేదు ఎందుకని? దేన్నైనా మనకు తగినట్లుగా మనమే మలచుకోవాలి. ఆలోచనల్లో స్వతంత్రత లేకపోతే ఎలాగ?"

ఇంటికి వచ్చాక రాములో పెద్ద మార్పే వచ్చింది. చాలా బాధ్యతతో మెలగటం మొదలుపెట్టాడు. పని చేసేటప్పుడు ఏవేవో పాటలు పాడుకుంటున్నాడు. తన తల్లిని తానే చూసుకుంటున్నాడు. ఇంటి పనులు కూడా చాలా చేస్తున్నాడు. భార్యను ఏమీ అనటం లేదు. హాయిగా, కులాసాగా ఉంటున్నాడు.

మొదట్లో భర్తలోని ఈ మార్పుకు అతని భార్య ఆశ్చర్యపోయింది. కానీ అతని సహచర్యంలో ఆమె గొంతూ తగ్గింది! మరికొంత కాలానికి ఊళ్ళో వాళ్ళకు ఏ సమస్య వచ్చినా వాళ్ళు రామునూ, అతని భార్యనూ సలహాలు అడగటం సామాన్యమైంది!

నవ్వండి!

**సెలవు కథలు!**

బాస్: నువ్వు రాసిన కథ చాలా బాగుందోయ్!

శేఖర్ (అయోమయంగా): నేను కథ రాయడమేమిటి సార్?!

బాస్: అదేనయ్యా, నిన్న నువ్వు పంపించిన లీవ్‌లెటర్లో కథ గురించి- ఎంత గొప్పగా అల్లావు! నీకు అవార్డు ఇవ్వాలయ్యా అసలు!

**తెలివి!**

తిమ్మయ్య: ఈ ఆవు ఎవరిదో తెలుసా, నీకు?

వెంగళప్ప: ఆవు ఎవరిదో తెలీదుగానీ దూడ మాత్రం ఎవరిదో తెలుసు.

తిమ్మయ్య: సరే ఎవరిదో తొందరగా చెప్పు!

వెంగళప్ప: ఆ ఆవుదే!

# చిలిపి ప్రశ్నలు-తిక్క జవాబులు

*రచన: శ్రీ వి.వి.యస్.మూర్తి, చొదిమెళ్ళ, పశ్చిమగోదావరి జిల్లా.*

1. రోజూ తల దువ్వుకోటానికి బద్ధకించే బద్ధకాల రావు చివరికి ఏం చేస్తాడు?

జవాబు: 'గుండు చెయ్యి బాబూ' అని సెలూన్‌కెళ్తాడు.

2. నిద్రపోతున్న హోంమినిస్టర్ ఎప్పుడు ఉలిక్కిపడతాడు?

జవాబు: భగవంతుడు కలలో కనపడి, "నా గుడికి సెక్యూరిటీ పెంచు" అని అడిగినప్పుడు.

3. మిమిక్రీ ఆర్టిస్ట్ "కుక్కను పెంచుకుందాం" అని భార్యతో అంటే ఆమె ఏమంటుంది?

జవాబు: "మీరుండగా అదెందుకు? " అంటుంది.

4. లైబ్రేరియన్ హోటల్‌కెళ్ళి ఎలా ఆర్డరు ఇస్తాడు?

జవాబు: "రెండు ఇడ్లి-ఒక కాఫీ తీసుకురా" అని సర్వర్‌కి చెవిలో చెప్తాడు.

5. ప్రశ్నాపత్రాలు లీక్ కాకుండా వుండాలంటే ఏం చెయ్యాలి?

జవాబు: పరీక్షలు పెట్టటం మానెయ్యాలి.

6. భర్తకు వాంతులు అవుతుంటే టివిలు చూసే తిక్కమ్మ ఏం అనుకుంటుంది?

జవాబు: ఆయన గర్భం దాల్చాడేమో అనుకుంటుంది.

7. నాలుగు లక్షల కట్నం పోసి కొనుక్కున్న భర్త నాలుగు రూపాయిలు కూడా సంపాదించకపోతే?

జవాబు: వినియోగదారుల కోర్టులో వ్యాజ్యం వేయాలి.




# తగని కోరిక

*అనువాదం: శ్రీ పి.వి.ప్రసాద్, విజయవాడ.* *మార్పు చేర్పులు: కొత్తపల్లి*
*"హిందూ" దినపత్రిక(27.3.2012)లో ప్రచురితమైన 'రాంగ్ ఛాయిస్' అనే హాస్యకథకు స్వేచ్ఛానువాదం.*

బాగా పేరున్న గణిత శాస్త్రవేత్త ఒకాయన, ఓసారి కులాసాగా ఒక పర్వత ప్రాంతంలో పోతుండగా ఆయనకో గొర్రెల కాపరి ఎదురయ్యాడు- పెద్ద గొర్రెల మందతో. ఆ మందలో చిట్టి చిట్టి గొర్రె పిల్లలు, బొచ్చు గొర్రెలు- చూసేందుకు ఎంతో ముచ్చటగా వున్నాయి. వాటిని చూడగానే ఆయన పరవశించి పోయాడు. 'ఎలాగైనా ఒక గొర్రె పిల్లను సంపాదించి పెంచుకోవాలి' అనే కోరిక ఒకటి ఉదయించింది ఆయన మనసులో .

దాంతో ఆయన ఆ గొర్రెల కాపరి దగ్గరికి వెళ్ళి "ఏమోయ్! నీ గొర్రెను ఒకదాన్ని నేను కొనాలనుకుంటున్నాను; ఎంత ఖరీదు అవుతుందో చెప్పు" అని అడిగాడు.

గొర్రెల కాపరి శాస్త్రవేత్తను తేరిపార చూశాడు. ఓ నిముషం తర్వాత "నా గొర్రెలు అమ్మేవి

కావు" అని సులభంగా ముగించేశాడు.

కానీ శాస్త్రవేత్తకు గొర్రెని పెంచుకోవాలని ఉంది! ఆయన గొర్రెలతన్ని రకరకాలుగా బ్రతిమాలాడు; ప్రాధేయపడ్డాడు- అయినా ప్రయోజనం లేకపోయింది- ఎందుకనో, గొర్రెల కాపరికి గొర్రెను అమ్మటం ఏ మాత్రం ఇష్టం లేదు!



చివరికి గణిత శాస్త్రవేత్తకు ఓ ఉపాయం తట్టింది. అతను గొర్రెల కాపరితో అన్నాడు- "చూడు బాబూ! నీ మందలో ఉన్న గొర్రెలను నేను ఒక్కొక్కదాన్నీ లెక్కించను- అయినా నీ దగ్గర మొత్తం ఎన్ని గొర్రెలున్నాయో ఖచ్చితంగా చెబుతాను. మరి నేను చెప్పే సంఖ్య సరయినదే అయితే, నా కష్టానికి ప్రతిఫలంగా నువ్వు నాకో గొర్రెను ఇవ్వాల్సి ఉంటుంది. చెప్పు- సరేనా?" అని అడిగాడు.

గొర్రెల కాపరికి ఆ పందెం ఏమంత నచ్చలేదు. అయినా పందానికి ఒప్పుకున్నాడు.

వెంటనే గణిత శాస్త్రవేత్త తన సంచీలోంచి ఒక కంప్యూటరును బయటికి తీశాడు. దానిలో ఆ ప్రాంతపు ఉపగ్రహ చిత్రం వెతికాడు. అక్కడున్న గొర్రెలు ఎన్నో లెక్కించమన్నాడు కంప్యూటరును. "ఇవి మొత్తం నూట రెండు" అని తేల్చి చెప్పేశాడు.

"మీరు చెప్పింది నిజమే!" ఒప్పుకున్నాడు గొర్రెల కాపరి- "...ఈ మందలోంచి ఒక గొర్రెను తీసుకెళ్ళండి" అన్నాడు.

శాస్త్రవేత్తగారికి చాలా సంతోషం వేసింది. వెంటనే మందలోకి వెళ్ళి, దిట్టంగా, బలంగా ఉన్న ఓ జీవాన్ని ఎంచుకొన్నారు. ఓసారి గొర్రెలకాపరికేసి చూసి, అతను గొర్రెపిల్లను ఎత్తుకున్నట్లే తనూ తను ఎంపిక చేసుకున్నదాన్ని భుజాలపైకి ఎత్తుకున్నారు.

అదేదో తేలికగానే ఉంటుందనుకున్నాడు తను- తీరా చూస్తే అది చాలానే బరువు ఉంది! "దీన్ని మోసుకొని వెళ్ళటం కొంచెం చాలా కష్టమేరా" అనుకుంటూ వచ్చిన దారినే పోయేందుకు వెనక్కి తిరిగారు, శాస్త్రవేత్త గారు.

అంతలోనే గొర్రెల కాపరి అరిచాడు వెనకనుండి- "సామీ! ఒక్క నిమిషం ఆగండి! నాక్కూడా మీతో ఓ పందెం కాయాలని ఉంది. మీ వృత్తి ఏంటో నేను సొంతంగా ఊహించి చెప్పేస్తాను. ఒకవేళ నా ఊహ సరైనదే అయితే మీరు గెల్చుకున్న జీవాన్ని నాకు తిరిగిచ్చేయాలి..." అన్నాడు.

వాడి పల్లెటూరి మాటలకు లోలోపలే నవ్వుకున్నారు గణిత శాస్త్రవేత్తగారు. 'సమయం వృధా చేయడం తప్ప వీడు ఏమీ సాధించలేడు పాపం' అనుకున్నారు. పైకి "అలాగే.. నువ్వడిగిందీ న్యాయంగానే వుంది. కానివ్వు- చెప్పు నేనెవరిని?" అన్నారు చిద్విలాసంగా నవ్వుతూ..

వెంటనే గొర్రెల కాపరి చెప్పేశాడు: "తమరు ఒక గణితశాత్రవేత్త! " అని!

ఊహించని ఈ జవాబుకి ఒక్క క్షణంపాటు బిత్తర పోయారు గణిత శాస్త్రవేత్త గారు. కొంచెం సేపటి తర్వాత తేరుకొని "నీకెలా తెలిసింది...?" అని అడిగారు.

"చాలా సులభమండయ్యా! తమరు కంప్యూటర్లో చూసి గొర్రెలు ఎన్నో కచ్చితంగా చెప్పేశారు.. అంటే 'తమకు లెక్కలు బాగా వొచ్చు' అని అర్థం అయ్యింది. కానీ అయ్యా, మందలోంచి గొర్రెను ఎంచుకొనే దగ్గర తమరు పప్పులో కాలేసారు. తమరు ఎత్తుకున్నది గొర్రెపిల్ల కాదు.. అది నా పెంపుడు కుక్క! దీన్నిబట్టి నాకు అర్థం అయిందండయ్యా, తమరి వృత్తి ఏంటో- తమరు గాలిలో లెక్కలు వేయగల్రు గానీ, భూమ్మీది లెక్కలు చేయలేరు- అంటే తమరు గణిత శాత్రవేత్తే అవ్వాలి గదా!" అన్నాడు.

గొర్రెల కాపరి మొరటు తార్కికతకు గణిత శాస్త్రవేత్తగారి కళ్ళు తిరిగాయి. ఆయన గర్వం అణగిపోయింది. సిగ్గుతో నోట మాట రాలేదు!




# అంతా మనసే

*'అనుమానం-పెనుభూతం' అని ఊరికే చెప్పలేదు పెద్దలు. అదెంత నిజమో ఈ కథ చదవండి, తెలుస్తుంది.*

అనగా అనగా చీనా దేశంలో పేరుగాంచిన విలుకాడొకడు ఉండేవాడు. ఒకరోజున అతను తన ధనుస్సును భుజానికి తగిలించుకొని, బాణాలు చేతబట్టుకొని, ఎత్తైన కొండ ఒకదాని మీదికి విహారంగా బయలుదేరాడు. అక్కడ తిరుగుతూ తిరుగుతూ ఉండగా అతనికి చాలా దాహం వేసింది. అయితే దగ్గరలోనే చెరువొకటి ఉన్నది-

అతను ఆ చెరువు దగ్గరికి వెళ్ళి, వంగి దోసిలితో నీళ్ళు తీసుకొని కడుపునిండా త్రాగాడు. సరిగ్గా అదే సమయానికి అతనికి నీళ్ళలో పాములాగా ఏదో కదిలినట్లు అనిపించింది. దోసిలిలో ఇంకా మిగిలి ఉన్న నీళ్ళను గబుక్కున వదిలేసి, అతను నీళ్ళలోకి పరిశీలనగా చూశాడు- అక్కడ అసలు అలాంటిదేమీ కనిపించలేదు!

అయితే అతనికి ఓ అనుమానం వచ్చింది- "కొంపదీసి తను నీళ్లతోసహా ఆ పామును మ్రింగెయ్యలేదు గద!" అని. అంతలోనే అతని కడుపులో దేవినట్లయింది. తటాలున చెరువు గట్టుపైకి ఎక్కి వాంతి చేసుకున్నాడు- వాంతిలో అతను ఉదయం తిన్న ఆహారమూ, మెతుకులూ, నీళ్ళూ కనబడ్డాయి తప్పిస్తే, పాములాంటిదేమీ, మరి, బయటపడలేదు!

అయినా 'తన కడుపులో ఏదో యాదుతున్నది; అటూ ఇటూ పాకుతున్నది' అని బలంగా అనిపించసాగిందతనికి. కడుపు మీద చెయ్యి వేసుకొని అతి కష్టం మీద ఊళ్ళోకి వచ్చిపడ్డ అతను, కనీసం ఇంటిదాకా కూడా చేరకనే కుప్పకూలిపోయాడు. ఊళ్ళో- వాళ్లంతా కలిసి అతన్ని ఇంటికి చేర్చారు. కడుపు నొప్పితో గిలగిలలాడుతున్న విలుకాడిని ఆ తర్వాత చాలామంది వైద్యులు పరిశీలించారు; కానీ ఏమీ ప్రయోజనం లేకపోయింది. యీలోగా విషచిహ్నాలు అతని శరీరంపై కనబడసాగాయి కూడా- అతను బరువు కోల్పోయాడు; ఎముకలు-చర్మం తప్ప శరీరంలో మాంసం అనేదే కనిపించకుండా పోయింది. 'నేనిక బ్రతకను' అని అతనికి గట్టిగా అనిపించసాగింది.

ఆ సమయంలో అటుగా వెళ్తున్న యాత్రీకుడు ఒకడు వాళ్ల ఇంట్లో ఆశ్రయం కోరాడు. విలుకాని రోగ స్థితిని చూసి జాలిపడి, "విషయం ఏంటి?" అని అడిగాడు. తను ఏ విధంగా కొండమీదికి వెళ్ళిందీ, చివరికి ఏ విధంగా పామును మ్రింగిందీ అతనికి వివరించాడు విలుకాడు.

"నీ సమస్యను నేను పరిష్కరిస్తాను. అయితే నేను చెప్పినట్లు చేయాలి" అని, బాటసారి అతన్ని మళ్ళీ అదే చెరువు దగ్గరికి తీసుకెళ్ళాడు.

"ఇంతకు ముందు నువ్వు నీళ్ళు ఎలా త్రాగావో చూపించు" అన్నాడు విలుకాడితో. విలుకాడి భుజానికి గతంలో లాగానే ధనస్సు వ్రేలాడుతున్నది. అతను అయిష్టంగానే వంగి, దోసిలితో నీరు తీసుకోబోతూ కెవ్వున కేక పెట్టాడు- కారణం, పాము ఒకటి నీళ్ళలో ఈదుతూ కనబడింది అతనికి! యాత్రికుడు

అతన్ని శాంతంగా ఉండమన్నాడు- ఆ పామునే కాసేపు గమనించమన్నాడు. విలుకాడికి ఇప్పుడు ధైర్యం చిక్కింది- పాముని జాగ్రత్తగా గమనించాడు- చూడగా అది అసలు పామే కాదు! తన భుజానికే వ్రేలాడుతున్నది కదా, ధనస్సు? దానికి కట్టిన త్రాడొకటి, వదులుగా క్రిందికి వ్రేలాడుతున్నది. దాని నీడ నీళ్లలో కదులుతూ పాములా భ్రమ కలిగిస్తున్నది- "అంటే తను కొద్ది రోజుల క్రితం మ్రింగాననుకున్న పాము, నిజానికి తన వింటి త్రాడు నీడేనన్నమాట!"

అతనిలో ఇన్నాళ్లుగా గూడు కట్టుకున్న ఆవేదన ఒక్కసారిగా ఉపశమించింది. కొద్ది రోజుల్లో అతను మళ్ళీ సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు!

నిజంగా అంతా మనసే. మనసు తప్ప మనకు తెలిసింది ఏదీ అసలు ఉండనే ఉండదు!

**జాగ్రత్త!**

భార్య(ఉత్తరంలో): ఏమండీ, జైల్లో బాగున్నారా? మన పెరడంతా ఖాళీగా పిచ్చిమొక్కలతో ఉంది. దానిలో కూరగాయలు పండిద్దామనుకుంటున్నా, ఎప్పుడు వేస్తే బాగా కాస్తాయో లెటర్ రాయండి కాస్త.

భర్త(జవాబు జాబులో): ఎప్పుడు సాగుచేయాలో తరువాత రాస్తాను గాని, జాగ్రత్త- నేను దాచిన సొమ్మంతా పెరటి మధ్యలో పిచ్చి మొక్కల మధ్యనే దాచాను. అక్కడ మాత్రం తవ్వకు.

మళ్ళీ రెండు రోజుల తరువాత:

భార్య(ఉత్తరం): ఏమండీ! ఎవరో కొంతమంది మనుషులు వచ్చారండీ..రెండు రోజులపాటు మన దొడ్డంతా తవ్వారు.

భర్త(జవాబు జాబు): నేనే తవ్వించానులే, ఇప్పుడు అందులో కూరగాయల విత్తనాలు నాటుకో.

# గార్డన్ కోర్మన్

యువకెరటాలు

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్.*

చాలా నెలల క్రితం కొత్తపల్లిలో ఒకసారి 'క్రిస్టఫర్ పాలినీ' అనే అబ్బాయి గురించి రాసాను- గుర్తుందా? 'పదిహేనేళ్ళ వయసులోనే అతను ఎరాగాన్ అన్న నవల రాసాడనీ, ఆపైన దాన్ని కొనసాగిస్తూ మరి మూడు నవలలు రాసాడు' అనీ చెప్పాను అప్పట్లో.



ఒక ముప్పై ఏళ్ల క్రితం, 'గార్డన్ కోర్మన్' అనే అబ్బాయి కూడా అదే పని చేసాడు. అయితే, విశేషం ఏమిటంటే, అతను ఆ తరువాత కూడా తరచు రచనలు చేస్తూ, పిల్లల రచయితగా మంచి పేరు తెచ్చుకున్నాడు. ఇప్పుడు అతనికి దాదాపు యాభై ఏళ్ళు! పెద్దయిన కోర్మన్ ఇప్పుడు కెనడాలో ప్రముఖ పిల్లల రచయిత! ఈమధ్య ఆయన గురించి చదువుతూ ఉంటే, అయన కూడా యువకెరటమే కదా అనిపించింది.

కోర్మన్ స్కూల్లో ఏడవ తరగతి లో ఉన్నప్పుడు, ఒకసారి ఇంగ్లీషు క్లాసులో వాళ్ళ టీచర్ ఒక నవల రాయమని హోం వర్క్ ఇచ్చాడట! (ఇప్పుడు అలాంటి హోం వర్కు ఎవరైనా ఇచ్చారంటే మన పని సరి!) అలాగ హోం వర్క్ కోసం అని చెప్పి కోర్మన్ ఒక నవల రాసేశాడు. అయితే అట్లా రాసి ఊరుకోకుండా, వాళ్ళ అమ్మ సాయంతో దాన్ని 'పిల్లల పుస్తకాలు ప్రచురించే సంస్థ' ఒకదానికి పంపించాడు కోర్మన్. వాళ్లకి అది నచ్చింది; దాన్ని ప్రచురించేశారు! అట్లా పన్నెండేళ్ళ వయసులో కోర్మన్ రచయితల జాబితాలోకి చేరుకున్నాడు. అట్లా స్కూలు చదువులు పూర్తి చేసుకునే లోపలే ఐదు పుస్తకాలు ప్రచురించాడట తను! ఇంకేముంది, వరస మొదలైపోయింది. కోర్మన్ రచనా ప్రస్థానం స్కూల్ తో ఎట్లా ఆగుతుంది ఇంక? బడి చదువులు పూర్తయిన తరువాత కూడా అతను రాస్తూనే ఉన్నాడు: గత ముప్పై ఏళ్లలో 60 పుస్తకాల దాకా రాసాడు! అతను రాసిన పుస్తకాలు లక్షలకొద్దీ కాపీలు అమ్ముడుపోయాయట కూడానూ!

కోర్మన్ గురించి ఒక చక్కని పిట్టకథ: అతను బాగా చిన్నగా ఉన్నప్పుడు ఎవరైనా "నువ్వు పెద్దయ్యాక ఏమౌతావు కోర్మన్?" అని అడిగితే, "నేను కుక్కని అవుతాను" అనేవాడట! పైగా, దానికి సిద్ధంగా ఉండాలని, టేబుల్ కింద కూర్చుని తినడం కూడా ప్రాక్టీసు చేసేవాడట!!

బాల రచయితగాను, పెద్దయ్యాక బాలల రచయితగాకూడాను కోర్మన్ ఎన్నో అవార్డులు అందుకున్నాడు. మామూలుగా, చాలామంది చదివినట్లుగానే కాలేజీ చదువులు చదివాడు. సినిమాలకి కథలు రాయడం గురించి, సినిమాలు తీయడం గురించి డిగ్రీలు చేసాడు. అతను రాసిన కథల పుస్తకాల్లో "మండే నైట్ ఫుట్బాల్ క్లబ్" అన్న సిరీస్ ని డిస్నీ చానెల్ వారు నాలుగేళ్ళ పాటు "ది జెర్సీ" అన్న పేరుతో సీరియల్ గా కూడా వేసారట! ఇప్పుడు కూడా ఆయన తరుచు పుస్తకాలు రాస్తూనే ఉన్నాడట. 'మొన్న జనవరిలో కూడా ఒక పిల్లల పుస్తకం విడుదలైంది' అని, 'ఇంకా కొన్ని పుస్తకాలు విడుదల కాబోతున్నాయి' అనీ చదివాను.




ఇంతకీ, ఈసారి చిన్న పిల్లల గురించో, కొంచెం పెద్దపిల్లల గురించో కాకుండా, ఈయన గురించి చెప్పడానికి ఒక కారణం ఉంది. "ఎప్పుడూ ఇలా పిల్లల్ని గురించి, వాళ్ళు చేసిన పనుల గురించీ రాస్తున్నామే, వీళ్ళలో ఎంత మంది పెద్దయ్యాక కూడా తాము పిల్లలుగా చేసిన పనుల్ని కొనసాగిస్తారు?" అని సందేహం కలిగింది ఆమధ్యన. అలా, "చిన్నప్పుడు ఏదో చేసి పేరు తెచ్చుకున్నాక, దాన్ని కొనసాగించిన వాళ్ళు ఎందరు?" అని వెదుకుతూ ఉంటే, ఈ గార్డన్ కోర్మన్ గురించి తెలిసింది నాకు! బాగుంది కదూ?

'కొత్తపల్లికి కథలూ, బొమ్మలూ వగైరా పంపే అందరూ కూడా, అలాగే తమ రచనాసక్తిని కొనసాగిస్తారు' అని ఆశిస్తున్నాను. కొన్నేళ్ళ తరువాత, అప్పుడు మీ గురించి కూడా నేను ఇలా రాస్తానేమో - "ఫలానా అమ్మాయి, చిన్నప్పుడు చిన్ని చిన్ని కథలు అవీ రాస్తూ ఉండేది, ఇప్పుడు ఫేమస్ రచయిత్రి అయిపోయింది" అని :-)

# సమీక్ష

*నిర్వహణ: శ్రీమతి మాలతీ కృష్ణ, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*




సొంత లాభం కొంత మానుకుని పొరుగు వాడికి తోడుపడితే ఓటమిలో కూడా గెలుపు వుంటుంది. ఆ గెలుపిచ్చే సంతోషం ఎంతో గొప్పది. ఈ విషయాన్ని సాధారణమైన అంశంతో చెప్పింది కొత్తపల్లి బృందం.

చదివేది ఐదోతరగతి ఐనా, పెద్దకథే వ్రాశాడు ఆర్య. మనుషుల్లో చందు-బిందు లాంటి మంచి వాళ్ళు కూడా వుంటారని నమ్మిన కోతి చివరికి వాళ్ళతో వెళ్ళి పోకుండా అడవిలోనే వుండాలనుకోవడం ఆర్య ఆలోచనల పరిణితిని తెలియచేస్తోంది.

అసూయతో అపకారం తలపెట్టిన గోపిని సహనంతో మంచిగా మార్చాడు రాము. సహనంతో చాలా పనులు చెయ్యవచ్చని వెంకటేష్‌కి తెలుసనుకుంటా.

రాణి వ్రాసిన 'ఆలోచనల శక్తి' తను వ్రాయడం వరకూ అర్థం చేసుకోవచ్చు: పెద్ద వాళ్ళెవరి దగ్గరో, లేదా ఏవో పుస్తకాల్లో చదివో అటువంటి అభిప్రాయాలని బలంగా నమ్మి వుంటుంది. కొత్తపల్లి వాళ్ళు దానిని ఓ విధంగా ఖండించినప్పటికీ, ప్రచురించటం మటుకు చెయ్యకుండా వుండాల్సిందనిపించింది. 'తప్పుదారి పట్టించే ఇటువంటి భావనలకు పిల్లల పుస్తకంలో తావివ్వటం అవసరమా' అనిపించింది.

"పిసినారి పుల్లయ్య" చాలా పరిచయం వున్న కథ.

'తృప్తి పరుడు' అనే మాట ముందెపుడూ వినలేదు. 'తృప్తి కలవాడు' అంటాంగానీ, అలా 'తృప్తిపరుడు' అనమనుకుంటా. ఎవరూ పుట్టించకుండా మాటలు పుట్టవుగానీ, మాటలకి ఓ వాడుక అంటూ వుంటుంది కదా! 37 వ పేజీలో 'నిండ పండ్లతో' అన్న ప్రయోగం కూడా అర్థంకాలేదు. ('నిండా పండ్లతో..' ముద్రారాక్షసం కావొచ్చేమో మరి!)

'నాగుల్ షరీఫ్' చాలా రకాలుగా ఈ సంచికకు తన సేకరణలను అందచేశాడు, బాగుంది.

జీవితంలో కీడైనా, మేలైనా కొన్ని పరిస్థితుల కారణంగానో మనుష్యుల ఆలోచనల కారణంగానో జరుగుతాయే తప్ప, వాటిని వాటికి ఏ మాత్రం సంబంధం లేని వస్తువులకీ-జంతువులకీ ఆపాదించుకోవడం మూర్ఖత్వం. దీనిని వినయ్ చక్కగా చెప్పాడు.

'ధర్మం' కథలో 'పీష్వాకి ఇచ్చిన వివరణనే రైతు సైనికులకి కూడా ఇచ్చి ఉండచ్చుగా, ఎందు కియ్యలేదు?' అని ధర్మసందేహం వచ్చింది గానీ, అలానే జరిగితే అతనికి బంగారం బహుమతిగా వచ్చుండేది కాదుగా!?

ఏ పనైనా - చెయ్యాలి కాబట్టి చేస్తే ఎంతో నిరాసక్తత కలుగుతుంది. ఏది నేర్చుకోడానికైనా 'ఒక ఉద్దేశం- (purpose) అంటూ వుండడం, అదీ మన మనసుకి దగ్గరగా వుండడం ఆసక్తిని పెంచుతుంది. 'జ్ఞానోదయం' ద్వారా ఈ విషయాన్ని అహమద్ గారు చెప్పిన తీరు బాగుంది.

'చిల్లికుండ ' కథాంశం సున్నితంగా , అర్థవంతంగా వుంది. అంత లోతైన అంశాన్ని చాలా సరళంగా చెప్పగలిగారు నాగలక్ష్మిగారు.

శంకరశివరావు గారు మ్యాజిక్ కథల ద్వారా చెప్తున్న విషయాలు ప్రాచుర్యంలో వున్నవే అయినా వాటిని కథల ద్వారా చెప్పడం మంచి ప్రయోగం.

'యువకెరటాలు ' ఈ సారి లేదెందుకో?! పాటలు కూడా లేవు!

వచ్చే సంచికలో వాటిని మళ్ళీ చూస్తామని ఆశిద్దాం!

# పదరంగం-18

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ పోస్టు కార్డులో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-19 తోపాటు ప్రచురించగలం. నిర్వహణ: కొత్తపల్లి.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| | 1 | | 2 | | |
| 3 | | 4 | | | 5 |
| | | | | 6 | |
| 7 | 8 | | | | |
| | 9 | | | | |
| 10 | | | 11 | | |

**ఆధారాలు నిలువు:**

1. "కొండల్లో.. --ల్లో.. " అని ఓ పాట (2)
2. అరుణ తల తెగిపోయింది! (2)
3. దీనిలో ప్రధమ స్థానం ఇంకా చైనాదే! (3)
4. లెక్కల్నే ఇలా పిలుస్తుంటారు(4)
5. 'కొండ' అని అర్థం (3)
8. ఆర్టీసీ అంటే రోడ్డు ---- సంస్థ (3)

**అడ్డం:**

2. తిరగబడ్డ వేరు(2)
3. మన జాతీయగీతం (6)
6. బంగారంతో చేసి ధరించేది (2)
7. మన దేశము (6)
9. పిల్లల కడుపు నొప్పికి మందు! (2)
10. రూపాయలో పదహారోవంతును ఇలా పిలిచేవాళ్లు.(2)
11. "ప్రపంచంలో" అని వేరేగా చెప్పండి.(3)

పదరంగం 17 కు సరైన జవాబు →

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 వ | ర్షా | 2 లు | | 3 కా | 4 మే |
| డ | | కా | | 5 మూ | ఘ |
| 6 గ | గ | న | 7 ము | | ము |
| ళ్లు | | 8 పా | న | 9 కం | |
| | 10 వ | | 11 గా | డి | 12 ద |
| 13 వ | ది | న | కు | | యు |

ఈసారి సరైన సమాధానం రాసిన వాళ్ళు:

1. కె. ప్రకాశ్, 4వతరగతి, మహీంద్రహైస్కూల్, జహీరాబాద్.
2. జి. తరుణి, 5వతరగతి, గడ్డంనాగేపల్లి, నార్పల.

# ఎగురుతోంది జెండా

*రచన: శ్రీS. శంకర శివరావు, ఉపాధ్యాయుడు, ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల, బద్దలాపురం, కనగానపల్లి మండలం, అనంతపురం జిల్లా.*

ఎగురుతోంది జెండా - ప్రజల గుండె నిండా

పిలుస్తోంది జెండా - భరతభూమి నిండా

మీకోసం నేనంటూ - ఎర్రకోటపైన ఎగసి ..(2)



తొలి పొద్దు పొడుపు నుండి

మలిపొద్దు పొడుపు దాక

ఢిల్లీ ఎర్రకోట నుండి ప్రతిపల్లె గుండెదాక

తరతరాలు తరగని శక్తిని నేనే అందిస్తానంటూ

"ఎగురు"

సర్వమతాలకు గుర్తులు

ముచ్చటైన మూడు రంగులు

హిందూ ముస్లిం క్రైస్తవ మతాల్ని

ఒకే జాతిగా నిలిపిన జెండా

ధనిక-పేద తేడా అనక ప్రజాస్వామ్యాన్ని పంచుతానని

"ఎగురుతోంది"

# రంజాన్ మాసం

*రచన: శ్రీ వారణాసి వెంకట్రావుగారు, విజయవాడ.*
*గానం: కావలి శ్రీ వేదాంతం శర్మగారు, తెనాలి శ్రీ మురళీకృష్ణగారు.*

రంజాన్ మాసం.. రంజాన్ మాసం
రంజాన్ మాసం.. రంజాన్ మాసం

పవిత్రమైన మనుగడ- నిర్దేశించు నిరుపమాన
ఖురాన్-అల్లా లోకానికి అందించిన మాసం
"రంజాన్ మాసం"

రాగద్వేషాలు మరచి రా భాయీ అంటూ
సోదరులుగ ఒకరినొకరు ఆదరించుకొను
మాసం "రంజాన్ మాసం"

చెడు చేయు తలపులు చేరనీక మనసున
రుజువర్తనులైజనులు సమాజాన మసలు
మాసం "రంజాన్ మాసం"

పగటి పూట ఉపవాసం రాత్రి సాత్వికాహారం
నిత్యం మసీద్ దర్శనం పవిత్ర ఖురాన్ పఠనం
ప్రతి ముసల్మాన్ మనసున అల్లా వసియించు
మాసం "రంజాన్ మాసం"

ఆకసాన చంద్రరేఖ అగుపించిన మరుదినం
జనులంతా ఉత్సాహంగా జరుపుకొందురు
రంజాన్ పండుగ "రంజాన్ మాసం"

ఈ పాటను మీరు ఇంటర్నెట్లో చక్కగా
వినే వీలున్నది! సందర్శించండి:
http://kottapalli.in

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కింటికి: 20 రూ.
12 పుస్తకాలకై చందా: 240 రూ.

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.
బ్యాంకు అక్కౌంటు వివరాలు:
"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**
ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం 'స్వాతంత్ర్యం వచ్చింది': వీరాంజి
చిత్రాలు: అడవి, వినయ్, చంద్రకాంత్, సురేష్, వెంకట్, గౌరిశంకర్, ప్రసాద్, శ్రీధర్, శివ.
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:** రిషివ్యాలీ స్కూలు వారికి, అభ్యాసవిద్యాలయం వారికి, తేజ టాలెంటు స్కూలు వారికి, గడ్డం నాగేపల్లి పుల్లయ్యగారికి, నందన గ్రామీణ పాఠశాల వారికి, ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల బద్దలాపురం వారికి, శంకర శివరావు గారికి, telugu4kidsవారికి, చిలిపిప్రశ్నల మూర్తిగారికి, 'విద్యార్థి' మాలతీకృష్ణగార్లకి, రాధా రాజశేఖర్ గార్లకి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచిపుస్తకం:

## అమ్మమ్మ చెప్పిన 65 కథలు

కొత్తపల్లిలో ప్రచురించే కథలు చాలా వాటిలో నీతి ఏంటో స్పష్టంగా రాసి ఉండదు- కథల్లో నీతిని తరచు అలా కనిపించీ కనిపించనట్టుగానే వదిలేస్తుంటాం- "ఎవరికి వాళ్లు ఆలోచించి కనుక్కోండి పిల్లలూ!" అన్నట్లు.

అయితే కథలు చదవటం అలవాటైన పిల్లలు, ఏ కథనైనా నమిలేస్తారు - నీతిని స్పష్టంగా రాసినా సరే, రాయకున్నా సరే. వాళ్లకు అన్ని కథలూ ఇష్టమే!

ముఖ్యంగా అమ్మమ్మలు కథలు చెబితే మరీనూ - ఎట్లాంటి కథలనైనా శ్రద్ధగా ఆలకించేస్తారు. అమ్మమ్మలు పెద్ద పెద్ద పదాల్ని అలవోకగా వాడేసినా సరే - వీళ్లు వాటినన్నిటినీ ఆకళింపు చేసుకొనేస్తారు; మళ్లీ ఆ పదాలనన్నిటినీ తమ సొంతం చేసేసుకుని వాడేస్తారు!

అట్లాంటి 65 నీతికథల పుస్తకం ఒకటి, ఆదూరి హైమవతి అమ్మమ్మగారు వ్రాసి యీ మధ్యనే ప్రచురించారు.

"అన్నం పరబ్రహ్మ స్వరూపం" - అన్నాన్ని వృధా చేయకూడదు - దగ్గరి నుండి, "అబద్ధాలు చెప్పకూడదు; "సంప్రదాయాల్ని గౌరవించాలి" "తీయటి మాటతీరు ఉండాలి" - ఇలా ఎన్నెన్నో మంచి విషయాల్ని చదివే పిల్లలందరికీ నచ్చే విధంగా, కథలు కథలుగా రాశారు. ఎక్కడికక్కడ సంస్కృతం శ్లోకాల్నీ, తెలుగు పద్యాల్నీ ఉదహరించారు కూడాను.

పుస్తకాన్ని అచ్చువేసిన గొల్లపూడి వీరాస్వామి సన్ వారు కూడా 352 పేజీల యీ బౌండు పుస్తకాన్ని సముచితమైన ధరకే అందించి ప్రోత్సహిస్తున్నారు.

పిల్లలు తిరుగాడే ప్రతి లైబ్రరీలోను, ప్రతి బడిలోను తప్పకుండా ఉంచుకోవాల్సిన పుస్తకం-

పిల్లలు, పెద్దలు అందరినీ ఆలోచింప జేసే పుస్తకం ఇది.



**అమ్మమ్మ చెప్పిన 65 కథలు**

రచన: శ్రీమతి ఆదూరి హైమవతి

గొల్లపూడి వీరాస్వామి సన్,

రాజమండ్రి, ఫోను: 2465253

352 పేజీలు, వెల:116 రూపాయలు.



# ఏకీకరణం!

అనగా అనగా ఒక ఊరు.

ఆ ఊళ్ళో అందరూ **క** భాష మాట్లాడతారు. ప్రక్క ఊళ్ళో అందరూ **చ** భాష మాట్లాడతారు.

కొందరు తెలివైన వాళ్ళు **క** భాషా మాట్లాడే వాళ్ళు; **చ** భాష కూడా మాట్లాడేవాళ్ళు. వాళ్లని అందరూ గౌరవించేవాళ్ళు.

ఆ ఊరి ప్రక్కన ఇంకో ఊరుండేది. ఆ ఊళ్ళో అందరూ **ట** భాష మాట్లాడేవాళ్ళు.

కొందరు తెలివైనవాళ్ళు **క** భాషా మాట్లాడే వాళ్ళు; **చ** భాషా మాట్లాడేవాళ్ళు; **ట** భాష కూడా మాట్లాడేవాళ్ళు. వాళ్లని అందరూ ఇంకా చాలా గౌరవించేవాళ్ళు.

ఇట్లా ఒకదాని ప్రక్కన ఒకటి, వేరు వేరు భాషలు- **క** నుండి **ఱ** వరకూ- మాట్లాడుకుంటూ ఒక పధ్నాలుగు ఊళ్ళు ఉండేవి. పధ్నాలుగు భాషలూ వచ్చిన వాళ్ళకి అందరికంటే ఎక్కువ గౌరవం దొరికేది.

అయితే అవన్నీ నేర్చుకునేసరికి వాళ్ళు పాపం, ముసలివాళ్ళు అయిపోయేవాళ్ళు!

వాళ్లంత తెలివైనవాళ్ళు కావాలని పధ్నాలుగు ఊళ్ళ జనాలూ వాళ్ళ పిల్లల్ని పోరటం మొదలు పెట్టారు. ఎంత వేగంగా చదివినా, మొత్తం పధ్నాలుగు భాషలూ వచ్చేసరికి ముసలివాళ్ళు అయిపోతారు కదా?! అందుకని ఆ పని ఎవ్వరికీ ఇష్టం లేకపోయింది.

చివరికి ఈ పధ్నాలుగు ఊళ్ళకీ అవతల ఉన్నవాడికెవరికో ఒక ఐడియా వచ్చింది:

వాడొక **ఇ** భాషని కనుక్కొని, దాన్ని ప్రచారం చేశాడు: "**ఇ** భాష చాలా సులభం. అది **క** భాష వాళ్లకీ సరిపోతుంది, **ఱ** భాష వాళ్ళకీ సరిపోతుంది. ఎవరికి వాళ్ళు, వాళ్ల భాషతో పాటు **ఇ** భాష నేర్చుకుంటే సరి! "

అందరికీ ఆ పద్ధతి నచ్చింది. దాంతో ఏ ఊరివాళ్ళు ఆ ఊళ్ళో కూర్చొని, వాళ్ల భాష, దాంతో పాటు **ఇ** భాష నేర్చుకోవటం మొదలుపెట్టారు.

కొన్నాళ్లకు పధ్నాలుగు భాషలూ వచ్చినవాళ్ళంతా చచ్చిపోయారు. మెల్లగా 13 భాషలు వచ్చిన వాళ్ళూ పోయారు. 12 భాషల వాళ్ళూ పోయారు. అట్లా చివరికి రెండు భాషల వాళ్ళే మిగిలారు అంతటా.

కొంత కాలం గడిచిన తర్వాత కొందరు తెలివైన వాళ్ళు అనుకున్నారు- "రెండు రెండు భాషలు నేర్చుకోవటం కష్టంగా ఉంది, ఒక్క **ఇ** భాష ఉంటే చాలు గదా" అని!

ఆ విధంగా కొన్నేళ్ళ తర్వాత పధ్నాలుగు భాషలూ చచ్చిపోయాయి; ఒక్క **ఇ** భాషే మిగిలింది!!

పధ్నాలుగు ఊళ్ళకీ అవతల బంగళా కట్టుకొని కూర్చుని అందరికీ తన భాషను నేర్పిస్తున్న **ఇ** భాష వాడు అప్పుడు నవ్వుకున్నాడు, వీళ్లందరినీ చూసి.

మీకు తెలుసా, ఇలా ప్రపంచం మొత్తం మీద ఈ సరికి 200 కి పైగా భాషలు చచ్చిపోయాయట, నిజంగా!!

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP.
Ph:08559 240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada, Phone:08662579129